ఓమ్.

# గురుభక్తిప్రభావము.

ఇది

శ్రీ సద్గురు మలయాళస్వాములవారిచే విరచితమ్ము.




మొదటికూర్పు 2000 ప్రతులు.

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు.

1947.

వలయువారు ఈ క్రిందివిలాసమునకు వ్రాసుకొనవలయును:—

శ్రీ వ్యాసాశ్రమము, యేర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.

# విషయసూచిక.

ఓమ్ తత్ సత్

# ప్రకృతి మోక్షద్వార వివరణము.



వీటియందు గల హంసముఖము మోక్షద్వారమనియు, సర్పముఖము ప్రకృతి ద్వారమనియు గ్రహింపదగినది ప్రకృతిద్వారము యెంతవరకు తెరవబడియుండునో, అంతవఱకు మోక్షద్వారము మూయబడియుండును (పై చిత్రముజూడుడు) యెప్పుడైతే ప్రకృతి ద్వారము మూయబడునో అప్పుడు, మోక్షద్వారము తెఱవబడును (క్రింది చిత్రము చూడుడు)

ముముక్షువులుయిది ఒక్కటి మాత్రము గ్రహించిన చాలును ప్రకృతిద్వారము జిహ్వోపస్థలనియు, మోక్షద్వారము బ్రహ్మరంధ్రమనియు గ్రహించుకొనవలయును ఇందులకు ప్రమాణము —

శ్లో॥ పృధివ్యాం యాంతి భూతాని జిహ్వోపస్థ నిమిత్తకం।
జిహ్వోపస్థపరిత్యాగే కో న ముచ్యేత బంధనాత్ ॥



శ్లో॥ మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాఽశుద్ధమేవ చ ।
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్ ॥

తా॥ మనస్సు శుద్ధమనియు అశుద్ధమనియు రెండువిధములుగా జెప్పబడుచున్నది. కామ సంకల్పము గల మనస్సు అశుద్ధము, కామ సంకల్పములేని మనస్సు శుద్ధము

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# ధర్మవాక్యములు.

1. మానవుని ఉచ్ఛ్వాసనిశ్వాసములు సరిగా నడచుచుండిన యేలాగున జీవితము సుఖముగా జరుగునో ఆలాగున తన నియమములను సరిగా ఆచరించువాడు గూడ ఇహపరసౌఖ్యముల నొందును.

2. సృష్ట్యాదినుండి సూర్యాదిగ్రహములు తమనియమములను తప్పక యేలాగున సంచారమును చేయుచున్నవో అందువల్ల, భూలోకము సుఖముగాయుంటున్నదో, ఆలాగున తమకేర్పడిన కార్యములను కాల సమయముల తప్పక, జేయువారుగూడ యీ జీవితములోనే పరశాంతిని పొందగలరు.

3 సస్యములను సరిగాపోషించిన యేలాగున ఫలములను నిచ్చువలెను చెట్లు, పైర్లు నిలిచియుండునో, ఆలాగున మానవులకేర్పడిన కృత్యము లను సరిగాఆచరించుచు వచ్చినవో యీ జన్మములోనే మోక్షఫలము నొసంగువలెను శరీరమునిలుచును.

4. గ్రహావేశముగలవారు తమనిజస్వరూపమును తెలియనొల్లక భూతముల స్వభావముగల్గియుందురో, ఆలాగున అవిద్యాదోషముండువలెను మానవులు తమద్వైతస్వభావమును తెలిసికొనజాలరు. గ్రహవిముక్తిగల్గిన, వెంటనే నిజరూపమును తెలిసికొనునటుల అవిద్య తొలగునప్పుడు తమద్వైతస్వరూపము గోచరమగును.

5. కర్ణధారుడు లేని పడవ, యేలాగున గమ్యస్థానమునుజేరక చెడిపోవునో ఆలాగున తురీయజ్ఞానములేనివాడు చుక్కానిలేని ఓడ చందంబున సరిగా గమ్యస్థానమును చేరజాలడు.

6. దైవసాక్షాత్కార జ్ఞానము గలుగువలెను తమకేర్పడిన పనిపూర్తిఅయి నదని తలంచి అజాగ్రతపడకూడదు.

7 సకాలమున వర్షముకురిసిన సస్యములు సమృద్ధిగాపండి, జనులు యేలాగున సుఖమును పొందగలరో, ఆలాగున మీకేర్పడిన కార్యములను సకాల మున నిర్వహించెదరేని మీజీవితమంతయు సౌఖ్యముగాగలదు ముక్తి యున్ను సులభముగాగల్గును

8 జ్యేష్ఠపుత్రుండు తక్కినపిల్లలందరిని యేలాగున తండ్రివలె, సంరక్షణ జేయవలసియున్నాడో ఆలాగున జీవజంతువులన్నిటిలోను మనుజుడు దైవమునకుజ్యేష్ఠపుత్రునివంటివాడు జ్యేష్ఠపుత్రుని తక్కినవార్లు తండ్రిగా భావించునటుల ఇట్టి భావముతో నడుచువాడు దైవసదృశుడగును




శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞాన మూర్తిమ్
ద్వన్ద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తన్నమామి॥

తా॥ ఈ గ్రంథమున గురుమూర్తిని వర్ణించిన దంతయు, ఈ శ్లోకమున గురు స్వరూప మెటుల నిర్ణయించ బడినదో, అదేరూపముగ యుండునని తెలియందగినది. అట్లైన మాత్రమే యీ తత్త్వముబోధపడ గలదు. కేవలజ్ఞానమూర్తియనియు, ద్వన్ద్వాతీతుడనియు, ఆకాశసదృశు డనియు, తత్త్వమస్యాది మహావాక్యముల యొక్క లక్ష్యార్థ మనియు, ఏకుడనియు, నిత్యుడనియు, విమలుడనియు, అచలుడనియు, బుద్ధ్యాది సర్వేన్ద్రియములకు సాక్షియనియు, భావాతీతుడనియు, త్రిగుణరహితు డనియు, అట్టి సద్వస్తువునే గురుమూర్తిగా వర్ణింపబడినది. శబ్దజాల మన్నిటిలోను, లఘు, గురు, అను రెండు భాగములేగలవు. గురుశబ్దము నకు అన్నిటికన్న, అధికమనియేయర్థము. అట్టిపదమును పొందుటవలననే శిష్యునియొక్క ధర్మము పూర్తియగును.

దైవాత్మ స్వరూపులగు ప్రియమైన సోదరీ సోదరులారా! గురు భక్తి యెట్లుండ వలయునో ఆ విషయమై యీ చిన్న పొత్తము తెలుపుచుండును. కావుననే, 'శ్వేతాశ్వతరోప నిషత్తు'న యిట్లు తెలుపడ మైనది.

శ్లో॥ యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః।

తా॥ పరమభక్తు డగువానికి తనయిష్టదైవమందు, యెట్టిగాఢ తమమగు భక్తియుండునో, ఆలాగున, గురు దేవునియందు దృఢమగు భక్తిగల మహాత్మునికి మాత్రమే యీ బ్రహ్మతత్త్వము బోధపడును.

మఱియు "ఆచార్యవాన్ పురుషోవేద" సద్గురుదేవుని కరుణవల్లనే యీ బ్రహ్మతత్త్వము బోధపడును. అనగా ఆచార్యుని ననుసరించిన పురుషుడు మాత్రమే యీతత్త్వమును పొందగల్గును. మఱియు 'ముండకోపనిషత్తున' "తద్విజ్ఞానార్థ స గురుమేవాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" తా॥ ముముక్షువైనవాడు ఆత్మసాక్షాత్కారము కొఱకు స్వయముగా కరమందుసమిధలను అనగా ఫలపుష్పసమిధలను ఎత్తుకొని శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడునగు గురువరుని పొందవలయు. ఇచట గురువెట్టివాడుగా యుండవలయునో, శిష్యుడెటుల వర్తించవలయునో, అట్టి రెండు ధర్మములను తెలుపడమైనది. శ్రోత్రియుడనగా శ్రుతిసార మెఱింగినవాడును, బ్రహ్మనిష్ఠుడుగను, యుండవలయు. ఇందువల్ల కేవలము బ్రహ్మనిష్ఠ ఒకటి యుండినమాత్రము చాలదనియు, లేక శాస్త్రపరనము మాత్రము చాలదనియు, నిర్ణయించడమైనది. ఏదో పూర్వపుణ్యావశముచే బ్రహ్మనిష్ఠ ఒకటి లభ్యమైనను శాస్త్రమును తెలియనిచో గురుశిష్యులసాంప్రదాయపద్ధతి తెలియబడదు. శాస్త్రము యొక్క శాసనమున్ను గోచరముగాదు. మఱియు శాస్త్రముమాత్రము జదివిననుచాలదు. అనుభవములేకపోయిన అనగా బ్రహ్మనిష్ఠ లేనిచో ఆత్మబోధ గలుగనేరదు. కావుననే విశేషణవిశేష్యముల యీ లాగున యుపనిషత్తు వర్ణించినది. శ్రీ కృష్ణభగవానులు గీతలో యీ లాగున తెలిపిరి.

"తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః"

తా॥ 1 ప్రణిపాతము 2 పరిప్రశ్నమము 3 సద్గురు సేవ యీమూడును శిష్యునికి యుండవలయుననియు తత్త్వజ్ఞానముగలవారే ఆత్మజ్ఞానోపదేశమున కర్హులనియు ఉపదేశించడము అయినది. తత్త్వజ్ఞానము శాస్త్రజనితమగుటచేతను సాక్షాత్కారజ్ఞానము అనుష్ఠానాధీనమగుటచేతను శ్రీ భగవానులు ఆలాగున తెలిపిరి. యీ విషయిమై శ్రుతిస్మృతులు సహస్రముఖములుగ యుద్ఘోషించుచున్నవి. ఇది సంక్షిప్త గ్రంథమగుటచే ఇచ్చట విస్తారముగా వ్రాయబూనలేదు. దీనికన్న ప్రబల

ప్రమాణము మఱియొకటి కావలయునా? గురువులేకనే స్వయముగా ఏల ఈశ్వరుని ధ్యానించి ముక్తిని పొందకూడదని గొంకుతలంతురు. ఆవిషయమై వేదాంతశాస్త్రమేమి చెప్పుచున్నదనగా మానవులు తమ మనస్సుతోనే ఈశ్వరచింతన జేయుచుందురు. మనస్సు సత్త్వరజస్తమో గుణములతో గూడియుండును. అప్పుడు మనోబుద్ధులకతీతమై యుండు బ్రహ్మమును యథార్థముగ తెలిసికొన జాలరు. ఏలననగా ఎఱుపు, తెలుపు, నలుపుగల సులోచనముల ద్వారా జూచువారికి దృశ్యమంతయు తాము ధరించియుండు అద్దములరంగువలెనే గనుపించును. అత్తఱి వారి స్వానుభవము సత్యమయి యుండిన దయినను అద్దముయొక్క వర్ణమే యాలాగున యుండునని వారు తలంపజాలరు. మూడు రంగులు గల అద్దపుముక్కలను ఒకరేకుపైనగాని పలకపైనగాని అమర్చి దాని వెనుకప్రక్క ఒకదీపము నుంచిజూచిన పురోభాగమున శుక్ల రక్త కృష్ణ రంగులతోనో ఆజ్యోతి వెలుగుచున్నట్లు గోచరమగును. కాని వెనుక ప్రక్కకువచ్చి చూచినచో ఆజ్యోతి స్వయంప్రకాశమైన దనియు మూడు రంగులతో ప్రకాశించుట అద్దముయొక్క రంగుల వలననే గలుగుచున్నదని గోచరమగును. అలాగున మూడు గుణముల కతీత మగు శుద్ధబ్రహ్మము స్వయముగా స్వచ్ఛమైన ప్రకాశముగలదనియు, మూడుగుణములతోగూడిన మనస్సుయొక్క మార్పువలననే యిట్లుగల్గుటకుకారణమనియు తెలియందగును. కావుననే మనస్సునందుభ్రమప్రమాది దోషములు గలవనియు, త్రిగుణములతో గూడినమనస్సును దాటిన మహనీయులకు మాత్రమే యీబ్రహ్మతత్త్వము తెలిసికొనదగునని శాస్త్రము తెల్పెడు రహస్యము. అలాగున మనస్సుతోనే శాస్త్రవిచారణ గూడచేయుదురు. మనస్సు త్రిగుణాత్మకము అప్పుడుపై జెప్పిన విధముగ మనస్సు ననుసరించియే తెలిసికొనిన వేదముయొక్క అన్తిమ భాగమగు యుపనిషత్తు ఇట్టి త్రిగుణ రహితమగు బ్రహ్మమును గురించియే నిరూపించు చుండును. కావున ఆత్మానుభవముగల ఆచార్యునివలననే దైవతత్త్వము తెలిసికొనుటకు శాస్త్రము వచించెడు రహస్యము. మఱియు రోగాదిదోషములచే జిహ్వాదోషము గలవారికి ఎంత మంచి రుచికరమగు పదార్థమయినను అరుచిగానే గోచరించును. అలాగున

అజ్ఞానమనెడు భవరోగము గలవారక ఈశ్వర స్వరూపమును శాస్త్ర సారమును యధార్థముగా తెలిసికొనుటకు సాధ్యముకాదు. కావుననే గురుముఖమునుండియే బ్రహ్మజ్ఞానమును తెలిసికొన వలయునని జెప్పుటకు కారణము. సంగీతజ్ఞానముగాని సంస్కృతవిద్యగాని ఆయాపుస్తకముల జూచి యెవరైనను నేర్చుకొనగలరా! వానిని నేర్చుటకు ఇదివరలో నేర్చుకొనియుండు ఒకయాచార్యుడెట్లు యావశ్యకమో యీ బ్రహ్మవిద్యయందు నాలాటి ధర్మముగలదు. అందువల్లనే " కర్ణధారం గురుంప్రాప్య "

తా॥ చుక్కానివాడు పడవలో గల జనులను తీరమున జేర్చునట్లు సద్గురుదేవుడే సంసారసాగరమును దాటించెడు నావికుడుగా యుంటున్నాడు చుక్కానిలేని పడవ ఏలాగున చున్నగవెళ్లి స్వస్థానమును జేరజాలదో, చుక్కాని వాడేలాగున పడవను అపాయము నొందనీయక దారి నుండి తప్పిపోనీయక గమ్యస్థానమును జేర్చునో, ఆలాగున గురుదేవుని సహాయముచేతనే అపాయమునొందక దారితప్పక సంసారసాగరమును దాటవలసియున్నారు అందు వలననే అనుభూతి ప్రకాశమునందు యీలాగున చెప్పుటకు కారణము. " వేదాన్తానామనేకత్వాత్ సంశయానాంబహుత్వతః, వేద్యస్యాప్యతిసూక్ష్మత్వాత్ నజానాతిగురుంవినా" వేదాన్త మార్గము అనేకములగుటచేతను, సంశయములు అనేకములగుటచేతను తెలియందగిన బ్రహ్మముమిక్కిలి సూక్ష్మముగుట చేతను గురుదేవుడు వినా ఇది గోచరము గాజాలదు. యీ కారణము వలననే శ్రీ రామావతారమున వసిష్ఠమునీంద్రుని వలనను, కృష్ణావతారమున సాందీపునివలనను ధర్మజ్ఞానముల బడయుటకు కారణము. శ్రీ శంకరాచార్యులును ఆలాగున శ్రీ గోవింద భగవత్పాదులను గురువుగా జేసికొనుటకు కారణము, ఇదే ప్రకారముగా, ప్రవక్త లందఱున్ను మతకర్తలందఱున్ను ఆచరించుచువచ్చిరి. అయితే ఇప్పుడుగల కొందఱిగురువుల నడతనుజూచియే ఇటువంటి గురువులు యేల యుండవలయునని లోకము జెప్పుటకు కారణమైనది. కావుననే గురుగీతా గ్రంధమున గురువు యొక్కయు శిష్యుని యొక్కయు ధర్మమును విశదముగా తెలిపిరి. కావున యీ లక్షణములనుచూచుకొనియే ఆచార్యునిగనుకొనవలయును.

ఈవిషయములో శిష్యులు జాగ్రత్తను వహించి యుండవలయును. అదే రీతిగ శిష్యులనుగూడ బాగుగాజూచుకొనియే గురువులుగూడ వర్తించ వలయును. లేనిచో దుష్టపుత్రులచే తండ్రిబాధ పడునటుల గురువులు గూడ అశాంతిని పొందవలసి యుందురు. కూర్మమేలాగున ధ్యానవృత్తి వలన గ్రుడ్డునుండి పిల్లలను తనరూపముగాజేయుచున్నదో, పక్షియేలా గున స్పర్శముచే గ్రుడ్డునుండి పిల్లలను తనవలెనే జేయుచున్నదో, అదే రీతిగ మీనమేలాగున చూపుచేతనే గ్రుడ్లను తనవలెనే మత్స్యరూప ముగా జేయుచున్నదో, ఆలాగున భ్రమరముగూడ పురుగును మహా మంత్రోపదేశమగు హ్రీంకార బోధనవలన తనరూపముగా యొనర్చు చున్నదో, ఇదేరీతిగా గురు శిష్యుల ధర్మముగలదు.

మఱియు అచ్చులో గరగిపోసిన కంచు యేలాగున అచ్చురూప మగు విగ్రహమగుచున్నదో, శిష్యుడుగూడ అట్లు భావన చేయుటచే, తన యాత్మయు ఆలాగున అయితీరును. కరగిన కంచుకు ఒక ప్రత్యేక రూపము లేకపోయినను ఆకృతిననుసరించి విగ్రహ మేర్పడునో శిష్యుని యొక్క భావముననుసరించియే గురురూపముగా మారవలసియుండును. కావున గురుశిష్యరూప ధర్మము చాలగొప్పది. ఇదియ్యిగాక రోగముచే స్మృతితప్పినవానికి మరల ఔషధసేవవల్ల స్మృతినిగలుగజేయు వైద్యుని యొక్క ధర్మ మెటువంటిదో, ఆలాగున భవరోగముచే ఆత్మను మరచి యుండు జీవునికి ఆత్మావబోధమును గలుగ జేయువాడే గురుదేవుడని మరువగూడదు.

అదేరీతిగ గ్రహావిష్టుడగు మనుజుడు తననిజరూపమును దెలియక ఆవేశించిన గ్రహరూపముగాను, గ్రహములయొక్క స్వభావముగాను కూడి యెటుల యుండునో, ఆలాగున శుద్ధజ్ఞాన స్వరూపముగల తన యాత్మను అజ్ఞానమను గ్రహమువలన మరుగుపడి యుండగా భూత వైద్యుడేలాగున గ్రహమును తొలగించి నిజరూపమును గలుగజేయు చున్నాడో, ఆలాగున ఆత్మ విస్మృతిగల శిష్యుని అనుష్ఠానము వలనను ధర్మబోధవలనను జ్ఞానమూర్తిగా జేయుటకు గురుదేవుడుతప్ప మరియెవని వలనను సాధ్యమయిన పనికాదని మరువకూడదు. ఇట్టి మహోపకార మొనర్చిన దేశికేంద్రునికిగల కృపయేమని జెప్పవచ్చును. ఆ ఋణము

ఎంత దీర్చినను తీరునదికాదు. ఆలాగున ఉత్తమక్షత్రియ వంశమున పుట్టినవాఁడును, భూపాలకుమారుఁడును నగు ఒకరాకుమారుఁడు ప్రమాదముచే బోటుమునిగి పోవుటవలన నీటిలోచేపలుపట్టు పల్లెవానికి దొరకినందుచే తాను ఆశిశువును తనబిడ్డగా పోషించుచు తన కులవృత్తియగు చేపలపట్టుపనిని నేర్పుచు వచ్చినందుచే రాచబిడ్డడును చెంబడివాడనని తలంచి అదేవృత్తి గల్గియుండగా క్రమముగా రాజభటులు వెదకి వెదకి యీబిడ్డనుజూచి రాజపుత్రుడని నెఱింగి అతనిసంబన్ధులకు తెలిపి వారలు సంస్కారశుద్ధినొనర్చి పట్టాభిషిక్తుని జేసినప్పుడు ఏలాగున తనక్షత్రియత్వమున్ను భూపాలత్వమున్ను గోచరమయినదో, ఆలాగున మాయాకల్పిత జాతి వర్ణాశ్రమగుణములతో బద్ధుడైన జీవుని గురుదేవుఁడు ఆత్మ ప్రబోధమును గలుగజేసి శుద్ధశివస్వరూపునిగ జేయునట్లు గురుశిష్యుల ధర్మముండును.

కర్ణుఁడు ఉత్తమక్షత్రియ వంశములో సూర్యాంశములో పుట్టినవాడైనను రాధ చాకినందుచే యేలాగున క్షత్రియత్వము మరచిపోయి రాధేయుడయ్యెనో, శివస్వరూపుఁడగు జీవునియొక్క స్థితియు ఆలాగున యుండును. త్రాచుపామువల్ల కరవబడి ఆత్మవిస్మృతి పొందిన వారికి పాముమంత్రముచే విషరహితునిగా నొనర్చునప్పుడు నిజమగు మానవత్వము ఏలాగున యేర్పడెనో, ఆలాగున అజ్ఞానసర్పదష్టుడై ఆత్మస్మృతి తప్పిపోయినజీవునికి గురుదేవుండు మహావాక్య దివ్యమంత్రోపదేశమును జేసి నిజస్వరూపమగు బ్రహ్మప్రబోధమును గలుగజేసిన ఆగురుమూర్తి యొక్క కారుణ్యమెటువంటిదో! ఎంతవర్ణించినను చాలకనే పోవుచున్నది. మఱియు అరణ్యమున చెట్టునందు దొంగలచే కట్టబడినవానిని ఆప్తుడువచ్చి చెట్టునుండి విప్పివేసి స్వస్థానమునకు సుఖముగా పంపినట్లు అజ్ఞానారణ్యమున ప్రాకృత దారాపుత్రగ్రహాదులందు భవపాశముచే కట్టబడిన యీజీవుని బన్ధవిమోచనమును జేసి నిజాత్మ స్వరూపము లోనికి చేర్చిన ఆ గురుదేవుని దయ యేమని చెప్పవచ్చును.

అట్టి కృతజ్ఞతయెంతతీర్చినను చాలదుగదా! ఆలాగున పుట్టంధుడైనవానికి నేత్రరోగమును తొలగించి కన్ను కనపరచేలాగున చేసినవానివలె అజ్ఞానతిమిరవ్యాధిచే నశించిన ప్రజ్ఞానముగల జీవునికి దివ్య నేత్రము

నొసంగిన గురుదేవుని ఋణమును మనమెంత దీర్చినను జాలదు. మఱియు దారిద్ర్యబాధచే సంకటపడు దీనునికి ఒకప్రభువు దారిద్ర్యమును తొలగించి గొప్ప శ్రీమంతునిగా జేసినచో ఆకృతజ్ఞతను ఎంతదీర్చినను చాలదు గదా! అలాగున అజ్ఞానజీవునికి పాపకర్మనుండి నివృత్తిజేసి ఆత్మసాక్షాత్కారమగు ఈశ్వరతత్వజ్ఞానమగు ఐశ్వర్యమును గలుగజేసిన గురుదేవుని యందుగల విశ్వాసమును ఏకాలమునకైనను మనము మరువవచ్చునా? యిట్టి స్థితిగురుదేవుని కృపాకటాక్షమువలన పొందవలసినదేకాని మఱియే యొకయుపాయములేదు. ఉప్పుసముద్రమున మునిగి మకరి మొదలగు జంతువులచే పట్టుబడి బాధపడుచుండు ఆ మానవుని ఆ దుష్టజలజంతువులనుండి విడుదలచేసి లవణసముద్రమునుండి దరిజేర్చిన, ఆ దయామయుని కరుణాదృష్టి యెట్టిదో, అలాగున సంసారార్ణవములో కామ రాగాది దుష్టగుణములచే బాధనొందుచుండు యీ జీవుని రక్షించి దరిజేర్చిన గురుదేవుడు మనకవసరమా? లేక అవసరముకాదా? అని ముముక్షువులే యోచించుకొనవలయును. అట్టి కృపానిధులగు గురు దేవులు తగ్గిపోయినందువలననే లేక దొరకక పోవుటవలననే యీ జీవులు సంసార సాగరములోపడి యుండవలసి వచ్చినది. ఈ సత్యమును తెలిసి కొనక పోవుటవల్లనే స్వయంకృషివల్ల మనమేల తరించగూడదని ప్రశ్నలన్నియు బయలుదేరు చున్నవి. ఇక యీ విషయమై చెప్పవలసినవి యెన్నియో గలవు. నిరూపించ వలసిన శాస్త్రములు గూడ అంసంఖ్యాకములు గ్రహించకొనతలంచనివారికి ఇక ఎంత చెప్పినను యేమిప్రయోజనము. నిప్పును వృద్ధిపరచ దలంచిన వానికి ఒక అగ్ని మిణుగురు దొరకిన చాలును. శ్రద్ధతో సన్నసన్నని పుల్లలువేసి పెద్దఅగ్నిగా చేయవచ్చును. అట్లు చేయనివానికి ఒకపళ్లెరమునిండుగా నిప్పుయిచ్చినను అదెచ్చటనో పారవేసిన బొగ్గై బూడిదై పోవునటుల యీ ఆత్మతత్వోపదేశముగూడ యుంటున్నది.

శ్రీ సీతారామాంజనేయమున చెప్పినదానిని జూడుడు.

సీ. గురుపదాంభోజముల్ గొలువక గల్గునే
పరివిమల వైరాగ్య భాగ్య మహిమ
గురుపాద తీర్థంబు గ్రోలక గల్గునే
జ్ఞానవిజ్ఞాన యోగానుభవము
గురుసుప్రసాదంబు గొనకున్న గల్గునే
ప్రీతిలేని చిత్తోపరతి సుఖంబు
గురుతత్త్వమాత్మఁ గన్గొనకున్న గల్గునే
నిరతిశయంబైన పరమ పదము

తే. అట్లుగావున విద్యార్థియైన యోగి
వినయ భయభక్తు లెదలోన బెనఁగొనంగ
నలచతుర్విధ శుశ్రూషలాచరించి
కొనుచు ననిశంబు గురువులఁ గొలుచుననఘ.

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.

ఇట్లు, మీచరాచర సుఖాభిలాషియగు,
శ్రీ మలయాళస్వామి.

ఓమ్ తత్ సత్.



ఓమ్

# గురుభక్తి.

---

## 1. సూర్యదృష్టాన్తము.

మహా గురుభక్తియు గొప్ప విరక్తియు తీవ్రముముముక్షుత్వము గల ఒకానొక ముముక్షువును, ఒక బ్రహ్మనిష్ఠుల సభలో ఉపన్యసించ వలసినదిగా సభాకార్య నిర్వాహకులుకోరిరి. వారల అట్టి కోరిక ననుసరించి ఆ గురుభక్తుండు ఉపన్యాసమును ప్రారంభించుటకు ముందుగా తన ఆత్మ గురువర్యుని మనస్సులో స్మరించి శ్రీ గురు స్తోత్రమును జేయ దలంచెను. అయితే గురుదేవుని ఎటుల స్తుతించిన బాగుండునని వితర్కము గలిగెను.

ప్రపంచములోగల చీకటిని రహిత మొనర్చి ప్రకాశమును గలుగజేసెడి సూర్యునిగా గురుదేవుని వర్ణించిన బాగుండునా యని తలంచెను. కాని అటులవర్ణించుట శ్రీ గురుదేవుని అవమాన పరచినటుల తలంచి అది మానివేసెను. ఏలననగా సూర్యుండు తమస్సును రహితముగజేసి ప్రకాశమును గలుగజేయునది నిజమయినను, సూర్యప్రకాశము భూగోళమున నొకప్రక్కన ప్రకాశమును గలుగ జేసినను భూమియొక్క మరియొకప్రక్కన చీకటిగానేయుండును. నా గురుదేవుడు ఒక స్థలమున ప్రకాశించుచు తక్కిన స్థలములయందు ప్రకాశించనివాడా? అటులయిన మాగురుదేవుఁడు ఎటుల వ్యాపకుడుగా గాగలడు. కావున యీ లాగున సూర్యభగవానునితో సమానముగా గురుదేవుని వర్ణింప కూడదు. అంతేగాదు సూర్యుండేక దేశమున యుండువాడు. మా గురుదేవుడు ఆలాగున యుండువాడా? వ్యాపకుడుగాడా? కావున ఇదియును సరియగునది కాదు. మఱియు సూర్యుడు కాలాంతరమున నశిం

చును. నా గురుదేవుడా యెల్లకాలముల ఏకరీతిగ నుండువాడు గాడా? అందుచే నిదియు సరిగాదు.

మఱియు సూర్యుండు పగలు మాత్రము ప్రకాశించి రాత్రిలో ప్రకాశము నివ్వజాలక యుంటున్నాడు, కావున యీ దృష్టాంతముగూడ సరియగునదికాదు. ఇకను ఆలోచించిన సూర్యుండు బయటప్రదేశమున మాత్రము ప్రకాశించుశక్తిగల వాడేకాని, జీవుల హృదయాంత రాళమున నిబిడమైయుండు అజ్ఞానతమస్సును రహితమొనర్చ జాలడు. నా గురుదేవుడో మనస్సులో నిగూఢమయియుండు అజ్ఞాన చీకటినిసహా పారద్రోల శక్తుడు. అందువలన యీ యుపమానమున్ను సరిగాలేదు. ఇదియును గాక దట్టమయిన మబ్బు వల్లను, గ్రహణ కాలము లోను, సూర్యుండు మరుగుపడి పోవుచున్నాడు. అట్టుల గురుదేవునివర్ణించినచో నశించిన అజ్ఞానము మరల ఆవిర్భవించి ఆత్మనుమరగుపరచును. అప్పుడు స్వప్రకాశుడగు నా గురుదేవునితో ఎటుల సమానముగాగల్గును. అంతే గాక, నా గురుదేవుని ఆవరణరహితునిగానే నెటుల తలంచగలను. కావున యీ దృష్టాంతమున్ను సరిపోదు. అంతేకాదు ఇదివేదాంత శాస్త్రమునకు విరుద్ధము. ఏలన, నశించిన మాయాదోషము గలవాడు ముక్తుడనియు అవిద్య మరల అట్టి ముక్తునిజేరదనియు శాస్త్రములు తెలుపుచున్నవి అవిద్యమరల జీవునిమరగు పరచనిచో తప్పకాజీవుడు మరల పునర్జన్మమును పొందవలసివచ్చును, అప్పుడు "నసపునరావర్తతే" అను శ్రుతి వాక్యమునకర్థము ఏర్పడును. కావున ఇదియును సరిగాదు.

శ్లో॥ యస్యదేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః॥

తా॥ పరమ భక్తుడయిన వానికి ఈశ్వరుని యందు ఏలాగున శ్రేష్ఠమయిన భక్తియుండునో, ఆలాగున గురుదేవుని యందున్ను భక్తి గల్గునో, అట్టి మహానుభావునకు మాత్రమే వేదాంతములో తెలుపబడిన అర్థముప్రకాశించును. అని శ్వేతాశ్వతరోపనిషత్తు తెలుపుచున్నది.

శ్లో॥ యదంఘ్రి కమలద్వన్ద్వం ద్వంద్వతాపనివారకమ్
తారకం భవసిన్ధోశ్చ తం గురుం ప్రణమామ్యహమ్॥

తా॥ యే గురుదేవుని పాదకమల ద్వంద్వము, జనన, మరణ, సుఖ దుఃఖాది ద్వంద్వముల రహిత మొనర్చునో జనన మరణ మయిన మహాదుఃఖమును గలుగజేసెడి సంసార సాగరమును తరింప జేయునదిగా యుంటున్నదో, అట్టి గురుదేవునకు నమస్కారము. ఈ లాగునస్తుతించి గద్గదస్వరముతో గగుర్పాటును జెంది డగ్గుత్తికతో యుపన్యసింప జాలక వాక్నిరోధముగల్గి మౌనముగా గూరుచుండెను. సభికులందఱును ఒక్క విధముగ ఆనందఘనీభావముతో నిశ్చేష్టులై ఇకమీద ఈ మహాత్ముని ముఖారవిందమునుండి ఏమిరాగలదో యనితలంచి మౌనముగానే చాల సేపు కూరుచుండిరి. ఇట్టి శీఘ్రకాలములోనే తమ కేలాగున యింతపరమ శాంతి కలిగినదని ఆలోచించు కొనుచుండిరి.

## 2. చంద్ర దృష్టాన్తము.

ఆలాగున మౌనముగా కూరుచుండిన పరమ గురుభక్తిగల ఆ ముముక్షువు మనస్సును ఇంద్రియములను కొంతనెమ్మతి జేసికొని సభికులమధ్య లేచి నిలుచుండి మరల గురుస్తోత్రమును జేయతలంచెను. అయితే ఇప్పుడు నాగురు దేవుని చంద్రునిగా వర్ణనజేయ చూచినను అదియును సరిపడకనే యుంటున్నది. చంద్రుడు చల్లనివాడును, ప్రసన్నుడును అయినను, చంద్రునియొక్క చల్లదనము ప్రసన్నత్వము యెల్లప్పుడును యుండుటలేదు. ఏలన శుక్లపక్షమున పై జెప్పిన రెండు గుణమును కొంతవరకేర్పడి యుండినను, కృష్ణపక్షమున క్రమముగా లేకనే పోవుచున్నది. నా గురుదేవుడు ఒకప్పుడు చల్లదనమును ప్రసన్నత్వమును గలిగి మఱియొకప్పుడు లేకపోవచ్చునని చెప్పవచ్చునా! ఆ మహాత్ముండు ఎల్లప్పుడును చల్లనిహృదయము గల్గి ప్రసన్నముఖముగల్గి యుంటున్నాడు గదా! కావున యీ చంద్రుని దృష్టాన్తము మా గురుదేవునకు చెప్పవచ్చునా? అదిసరి గాదు. అంతేగాదు, చంద్రునితో యుపమించిన అదిగొప్ప దోషము. ఎట్లనచంద్రునికి శుక్లపక్షమున వృద్ధియు, కృష్ణపక్షమున క్షయమున్ను, కలుగుచున్నది. మా ఆత్మదేశికుడు అటువంటి హెచ్చు తగ్గులుగల వాడా? ఎల్లప్పుడును పరిపూర్ణుడై వృద్ధిక్షయములు

లేనివాడు కదా! కావుననే యీ దృష్టాంతము నేమాత్రమును సరియగునది కాదు. అదియునుగాక, చంద్రునియందు కళంకము గలదు. శరత్కాల పూర్ణిమాచంద్రుండయినను, చంద్రమండల మధ్య ప్రదేశమున కళంకము కనుపించుట లేదా! మాఆచార్యుడు అలాగుననే కళంకము గలవాడా? కావుననే యీ దృష్టాంతమున్ను అసలే పనికిరాదు. ఏలన మాతండ్రి యగు గురుదేవుడు సదానిష్కళంకుడు. అందువలన యీ ఉపమానము ఎటుల సరిపడును. అంతేగాక పరమేశ్వరుండు చంద్రుని ద్వారా ఓషధుల పోషించునటుల గీతలో గలదు.

శ్లో॥ గామావిశ్య చభూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామిచౌషధీస్సర్వాః సోమోభూత్వారసాత్మకః ॥

తా॥ నేను భూమిని ప్రవేశించి బలముచేత సమస్త భూతములను ధరించుచున్నాను. రసస్వరూపుడగు చంద్రుడనై సమస్త సస్యములను వృద్ధినొందింప జేయుచున్నాను.

పై జెప్పిలాగున మాదేశికుడు మఱియొక ప్రకాశముచే మఱియొక రసముచే ప్రకాశించువాడా? రసస్వరూపుడై యుండువాడా? ఆమహాత్ముడు స్వయం ప్రకాశుడును అమృతైక రసస్వరూపుడుగా యుంటున్నాడు గదా! దైవస్వరూపుడగు మాగురుదేవుడు స్వయముగా ప్రకాశించువాడు. తనప్రకాశము చేతనే సమస్తము ప్రకాశించుచున్నది ఇట్లుండగా నిరుపయోగమగు చంద్రదృష్టాంతము మాగురు దేవునికిచెప్పవచ్చునా? కావున ఇదియు, సరిపోదు. మఱియు చంద్రుడు పరప్రకాశముచే అనగా సూర్యుని ప్రకాశముచే ప్రకాశించువాడు. ఆలాగున మఱియొక సహాయ ప్రకాశముచే ప్రకాశించువాడా మా గురుదేవుడు? ఆమహానీయాత్ముడు స్వయం ప్రకాశముగలవాడు. కావున యీదృష్టానము యేమాత్రముసరికాదు. అందువలన నేనెటుల గురుసుతి జేయగలను? నా కేమియుతోచుట లేదు. మఱియొక విధముగ ఆలోచించినను చంద్రునితో సాదృశ్యము గనిపించుటలేదు. ఎట్లన చంద్రుడెల్లప్పుడును భూమి చుట్టును తిరుగుచుండును. మాగురుదేవుడు సదా అచలుడై యుండువాడు. కావున యీ దృష్టానము ఎటుల సరిపోవును? అదియునుగాక గ్రహణకాలములో రాహుకేతువులు చంద్రుని పీడించుచున్నారు.

అనగా మరగుపరచుచున్నారు. ఆలాగున మాగురుదేవుని యేదైనవీడింప గలదా? మూలావిద్య సంపూర్ణముగ నశించిన ఆమహానుభావుని మూల ప్రకృతి గూడ ఆవరింపజాలదే! సంపూర్ణ శోకశాస్తిని పొందిన మహాను భావుడే మాఆచార్యుండు. దంచిపొట్టును వదలించిన బియ్యమును మరల ఆ యుమక, యెప్పుడైనా బియ్యమును ఆచ్ఛాదింపగల్గునా? ఆలాగున నిశ్శేషముగ మూలప్రకృతిని రహితమొనరించిన, ఆ మహనీయాత్ముని యేదియు యెప్పుడును, ఆవరించునా? మఱియు చంద్రునియొక్క ప్రకాశము రాత్రిలోనే గలుగు చున్నది. సూర్యోదయము గలిగిన వెంటనే, ప్రకాశశూన్యుడగుచున్నాడు. నాగురుదేవుడు అట్లుండువాడా? రేయింబవళ్లు ఒకేవిధముగా వెలుగుచున్నవాడుగదా! కావున యీదృష్టాంతము ఎటుల సరిపడును? అందువల్ల ఎన్నియో విధములుగ ఆలోచించినను మౌనము తప్ప మఱేమియు తోచుట లేదు. ఇందు వలన కాబోలు శ్రీ దక్షిణామూర్తి సనకాది యోగులకు బ్రహ్మ తత్త్వమును సరిగా చెప్పజాలక మౌనమును ధరించినదానికి కారణముగా యుండవచ్చును.

శ్లో॥ చిత్రంవటతరోర్మూలే వృద్ధాశ్శిష్యాగురుర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః

తా॥ కైలాసశిఖరమున, వటవృక్షమూలమునయుండి సనకాదులగు మహాయోగులకు జ్ఞానముద్రమును ప్రదర్శించి మౌనముగాయుండుటనుజూచి శిష్యులగు సనకాదులు సర్వసంశయములను నశింపజేసు కొనిన వారై శివజీవైక్యపరులై యుండిరి. మఱియు చంద్రునిదృష్టాంతముగా జేయుటలో ఒక గొప్పదోషముగలదు. చంద్రునికి వ్యభిచారదోషము గలదు. అందువలన శాపగ్రస్తుడయినాడు. మాగురుదేవుడు యిట్టిదుష్ట వ్యభిచార దోషముగలవాడా? ఆ మహాత్ముండు అస్ఖలిత బ్రహ్మచారి గదా! యిట్టి విచారము వలనయున్ను చంద్రుని ఎటుల మా గురుదేవునితో సమానముగా జేయవచ్చును? ఇవన్నియు ఆలోచించిన మౌనము యొకటి మాత్రమే శరణ్యముగ గోచరించు చున్నది. కావుననే కవులు ధర్మసంకటములలో యేమియు చెప్పతోచని స్థలములలో మౌనమే గతి యని వర్ణించు చున్నారు. కావున నేనును యీ గురుస్తోత్ర మందు మౌనమునే శరణ్యమునుగా జేసి కొనుచున్నాను. అని చెప్పుచు సభా

మధ్యమున నిప్పులో గరగిన నెయ్యివలె గురుభావములో లీనమయిన మనస్సుగలవాడై ఆనందభాష్పము ఝడివానవలె రెండు కన్నులనుండి కురుచు చున్నవాడై మూర్ఛజెంది పడిపోయెను. వేలకొలది సభికులచే నిండియుండు ఆ సభికులందఱును భిత్తియందు చిత్రించిన చిత్తరువువలె నిశ్చేష్టితులై ఎప్పుడును అనుభవించని బ్రహ్మానంద భరితులై ఆనంద భాష్పపూరిత లోచనులై అందఱును ఏక కంఠముతో మేము ధన్యుల మయితిమి. మా సంసారతాపాగ్ని చల్లారినది. కృతార్థు లయితిమి కృతార్థులయితిమి. ఎన్నియో మహోపన్యాసముల యిదివరలో వింటిమి యిట్టి పరమశాంతిని మే మెప్పుడును పొందలేదు. మీ భావజలరాశిలో మా మనస్సయిన లవణఖండము లన్నియు లీనమయి పోయినవి. అని చెప్పుచు నిశ్చలులై కూర్చుండిరి.

## 3. సముద్ర దృష్టాంతము.

స్మృతితప్పి పడియున్న ఆపరమభక్తుడు, సూర్యుడుదయించు నప్పుడు తామర పుష్పము కొంచెము కొంచెముగా, వికసించునటుల, ప్రసన్నముఖము గలవాడై, ఓం, ఓం, అని చిన్నగానుచ్చరించుకొని, స్మృతిగలవాడై ఈలాగున గురుస్తోత్రముజేసి, లేచి కూరుచుండెను.

శ్లో॥ యస్యస్మరణమాత్రేణ జ్ఞానముత్పద్యతే స్వయమ్ ।
సఏవ సర్వసమ్పత్తిః తస్మాత్సంపూజయేద్గురుమ్ ॥

తా॥ ఎవరిని స్మరించిన మాత్రములోనే జ్ఞానము స్వయముగా ఉదయించునో, అట్టివారే జ్ఞానైశ్వర్యాది సకల సంపత్తులు గలవారు. కావున అట్టి గురుమూర్తినిభక్తిశ్రద్ధలు గలవాడై సేవింప వలయును.

శ్లో॥ సంసార వృక్షమారూఢాః పతన్తి నరకార్ణవే ।
యస్తానుద్ధరతే సర్వాంస్తస్మై శ్రీగురవేనమః. ॥

తా॥ సంసార వృక్షమును ఎక్కినవారు, ఎవరైతే నరకసము ద్రములోపడి పోవుచున్నారో, అట్టివారందఱిని సంసార సాగర తీరమున జేర్చుచుండునో, అట్టివాడగు గురువరునికి నమస్కారము.

## సముద్ర దృష్టాంతము. 1

ఇప్పుడు సముద్రముతో గురుదేవుని దృష్టాంతముగా జెప్పదలంచిన అదియు నెంతమాత్రము సరిపడదు. సముద్రమువలె అపారమహిమాన్వితుడని, జెప్పుటకును వీలులేదు. ఏలన సాధారణముగా సముద్రము అపారమని జెప్పుచుండినను సముద్రమునకుగూడ, పారముగలదు. ఆలాగున, మాగురుదేవుని వర్ణించిన మాగురుదేవుని యొక్క సర్వవ్యాపకత్వమునకు, హానివచ్చును. దేశముతోను, కాలముతోను, అతీతుడైయుండు, ఆత్మస్వరూపుడగు గురుదేవుని, యెట్లు దేశకాలములకులోబడిన, వానినిగా జెప్పవచ్చును? కావుననిదియు సరిగాదు. అదియునుగాక సజాతీయ విజాతీయ స్వగతభేదరహితుడగు, ఆమహాభావుని నేనెటుల సంకుచిత పరచగలను. అది ఆదివ్యపురుషుని అవమానించునటుల గదా? మఱియు అగాధమనగా అంతు తెలియని ఆ పరమ పురుషుని అంతుగల సముద్రముతో నెటుల సమానముగా వర్ణింపగలను. సాగరమునకు అగాధమని పేరుగలిగి యుండినను, అచ్చోట చాలా లోతైనదనియే అర్థము మనము గ్రహించుకొనవలయును. ఇప్పుడు పసిఫిక్ మహాసముద్రము ఇంతలోతుగలదని శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. కనుక యీ యుపమానముగూడ సరిపోలేదు. మఱియు సముద్రజలమంతయు లవణరసమయమైనది. త్రాగుటకు యుపయోగపడదు. మా గురుమూర్తి యొక్క హృదయము, సముద్రపుక్షారోదకము వంటిదా? ఆహృదయము అమృతమయమైనది గదా! అందువల్ల యీ దృష్టాంతమున్ను, కొంచముగూడ సరిపడదు. అదిన్నిగాక సముద్రజలమును ఎవరున్ను పానమొనర్చునటులగా మా స్వామి యుంటున్నాడా? అనేక జిజ్ఞాసువులు రేయిం పగళ్లు వచ్చి జ్ఞానామృతమును పానమొనర్చి తృప్తులై పోవుచున్నారే. కావున ఆ దృష్టాంతమెటుల సరిపోవును. అంతేగాక అర్ణవము సదా అలలచే చంచల స్వభావము గల్గియున్నది. మా దేశికేంద్రుడు ఆలాగున చపల స్వభావముగలవాడా? ఆ మహాత్ముండు శమదమములు గలిగి అచలుడై కల్లోల మణగిన మహా సాగరమువలె నిశ్చలుడై యుండునుగదా! అదిన్నిగాక సముద్రాంతర్భాగమున అనేక క్రూరములగు జల చర జంతువులు గలవు. అనగా గొప్ప గొప్ప పాములు మకరములు తిమింగలాదులు భయంకరములగు ఎండ్రకాయలు మొదలయి

నవి అసంఖ్యాకములు సముద్రగర్భములోగలవు. కావున యిట్టి దృష్టాంతము యే మాత్రము పనికిరాదు. మా దేశికేంద్రుని హృదయమో? శాంతమయిన రత్నములతోను కరుణారసముతోను సహన ముత్యములతోను వైరాగ్యపగడములతోను నిండియున్నది గదా; ఓహో! యీ సముద్రదృష్టాంతమెటుల సరిపోవును. అదియునుగాక అర్ణవాంతర్గత క్రూరజల జంతువులు ఎల్లప్పుడును ఒక్క దానిని మఱియొకటి హింసించి తినుచునే యుంటున్నవి. మా గురు దేవుని హృదయము అహింసా ధర్మముచే పూర్ణమయి యున్నది. అట్టి పావన హృదయములో సదా ఒక ప్రాణికైనను మేలుజేయవలయునని తలంపుగలుగునే గాని కీడుజేయ వలయునని తలంపు గలుగనేరదు. పావన హృదయమునకున్ను సదా పాప కృత్యమును జరుగుచున్న సాగరాంతర్భాగమునకున్ను ఎటుల సమత్వము జెప్పవచ్చును. ఇది రాత్రి పగళ్లకు సమత్వము జెప్పినటులుండునుగదా! కావున యిట్టి విరుద్ధ ధర్మమును దృష్టాంతముగా విజ్ఞులెవరైన జెప్పగలరా? ఒకవేళ చెప్పినను ఎవరైన నమ్మగలరా? కావున దీనిని నేనుజెప్పజాలను. సముద్రజలాంతర్భాగమున బాడబాగ్ని నిగూఢమయియున్నది. ప్రళయకాలమున యీ అగ్ని ప్రజ్వలించును. అప్పుడు సముద్రపునీరంతయు అంతర్ధానమై పోవును. అత్తఱి సముద్రమే నామరూప రహితమగును. ఆలాగున మా ఆచార్యోత్తముని హృదయమును దృష్టాంత పరచుట ఎంత మాత్రము సరిగాదు. ఇది జలాగ్నులకు దృష్టాంతము జెప్పినటులయున్నది. కావున అది నేను జెప్పజాలను. అట్టి అగ్ని ప్రజ్వలించి సముద్రనీరునుయింకునటుల జేయునటుల మా గురుదేవుని జ్ఞానమును ఏ యగ్నినశింప జేయును? ఇట్లుండగా యీ దృష్టాంతము ఎటుల జెప్పవచ్చును. అంతేగాక సముద్రము అనేకనదులచే సృష్ట్యారంభమునుండి నేటివరకు జలమును తనలోనికి పీల్చుకొనియు తృప్తినిపొందకనే యున్నది. మా గురు దేవుడా నిత్యతృప్తుడు. సముద్రమువలె సర్వనదీ ద్వారములను తెరచియుంచినటుల మా గురు దేవుడుంటున్నాడా? ఆ మహానుభావుడు సర్వేంద్రియనిగ్రహముగల వాడు. అట్లుండగా వీరుభయులకు సమానదృష్టాంతమెటులజెప్పవచ్చును? అదిన్నిగాక సముద్రపు అడుగుభాగమున బురదమయమె యుండును.

మాగురుదేవుని హృదయము యొక్క అడుగున బ్రహ్మానందఘనము శాంతియు శివము, మఱియు సముద్రపు అడుగున ప్రపంచములోగల మాలిన్యమంతయు జేరి యుండును. నాగురు దేవుని మనస్సులో వేద సారమగు జ్ఞానము నిలిచియున్నది. కావుననే యీ రెండింటికిన్ని దృష్టాంతము ఎటుల సరిపోవును. అనిజెప్పుచు ప్రతిష్ఠింపబడిన విగ్రహమువలె నిశ్చలుఁడై యుండుచు విగ్రహమునకు అభిషేకముజేసినజలము ధారధారగా ప్రవహించుచుండిన యేలాగున యుండునో ఆలాగున గురుభక్తుని యొక్క నేత్రద్వయమునుండి ఆనందబాష్పములు పొంగిపొరలుచుండెను. అనేకవేలజనులతో క్రిక్కిరిసియుండిన ఆసభయందయు ఒక్కపెట్టున ఓ మహానుభావా ? మేము అనేక శాస్త్రములజదివినవారి యుపన్యాసముల ఎన్నియోసార్లువింటిమి. వేదములనువివరించి ఉద్ఘాటనము జేయువారి బోధనలుగూడవినియుంటిమి. యేయుపన్యాసనమును జెప్పకనే శ్రీగురు ధ్యానములో మగ్నులై యుండు మీయొక్క గురుభక్తి ప్రభావమును, వీక్షించినందుచే మానేత్రములు సఫలములయినవి. మీయొక్కగురుభక్తి పరమగువాక్యముల వినుటచే మాకర్ణములు సాఫల్యతనుగాంచినవి. ఎన్నియోవిధములగు యోగసాధనలచేతనైనను, నిశ్చలత్వమునొందని మాచిత్తము చేష్టలుడిగినిలచియుండు మీకాయమువలె నిశ్చలత్వము పొందినది. అని జెప్పుచు సభలోయుండు స్త్రీ పురుషులందురు యీలాగున గురుస్తుతిజేసిరి.

శ్లో॥ అనేకజన్మసంప్రాప్త కర్మబంధ విదాహినే
జ్ఞానానలప్రభావేన తస్మైశ్రీగురువేనమః.

తా॥ జ్ఞానాగ్ని ప్రభావమువలన అనేకజన్మములనుండి యేర్పడిన కర్మబంధములను దహింపజేసిన ఆ గురుదేవునికి నమస్కారము.

శ్లో॥ తాపత్రయాగ్ని తప్తానా మశాంతప్రాణినాం భువి
గురు రేవపరాగంగా తస్మై శ్రీ గురువేనమః.

తా॥ భూలోకములో తాపత్రయమను నగ్నివలన తపింపబడుచు అశాంతిని జెందినప్రాణికోట్లకు గురుదేవుడే గొప్పదగు గంగానదియగును. అందులన అట్టిగురుదేవునికి నమస్కారము.

ఓమ్.

# 4. మహామేరు దృష్టాన్తము.

నిశ్చేష్టుడై నిశ్చలుడై యుండు ఆ గురుభక్తునకు మందమారుతముచే కదళీవనము చిన్నగా చలింప ప్రారంభించునట్టుల శరీరమునందు ప్రాణచలనముగూడ ప్రారంభమాయెను. అప్పుడు ఓం, ఓం, ఓం, అని మూడుసార్లు యుచ్చరించుచు:—

శ్లో॥ భవారణ్యప్రవిష్టస్య దిఙ్మోహభ్రాన్తచేతసః
యేన సందర్శితః పన్థాః తస్మై శ్రీగురవేనమః.

తా॥ అజ్ఞానమను కారడవిలో దిక్ భ్రాన్తివలన దిక్కు తెలియనివారికి యే ఆపుని వలన మార్గము జూపింపబడెనో అట్టి శ్రీ గురు దేవునికి నమస్కారము, అని జెప్పుచు మరల యీలాగున వచింప ప్రారంభించెను. మహా మేరువుగా నేను గురుదేవుని వర్ణించి స్తుతింప జూచినను, సరిపోవులాగునలేదు. ఒకవేళ మేరుపర్వతమువలె గొప్ప ధీరుడుగా వర్ణించినను సరిపోదు. ఏలన? మేరుపర్వతము వట్టి మట్టిరాళ్లగుట్ట దానియందు అచ్చటచ్చట రత్నములున్ను యుండవచ్చును. మా గురుదేవుకు ఆలాగున రాతిగుండు వంటివాడా? మట్టిదిబ్బవంటివాడా? యీ మహాముని సత్తముడు జ్ఞాన రత్నములకు రాశిగదా! మేరు పర్వతమునకు జ్ఞానము గలదా? అదిజడ వస్తువుగదా? మాగురుదేవుడు చైతన్యమూర్తి, జడమునకు చైతన్యమునకు ఎంతభేదము గలదు. అట్లుండగా ఏలాగున మేరుగిరితో మాగురుదేవుని యుపమానము జెప్పవచ్చును? మరియు మేరుగిరి యిన్ని యోజనములపొడవు; యిన్ని యోజనముల ఎత్తుగలదనిశాస్త్రములలో నిర్ణయించ బడియున్నది. సర్వలోక వ్యాపకుడగు మాగురుదేవునికిని ఏకదేశమందుండు పర్వతమునకున్ను ఎట్లుసాదృశ్యము జెప్పవచ్చును. కాన యిదియు సరిగాదు. మఱియు మేరుపర్వతమున ఏకప్రదేశమునందు పార్వతీ పరమేశ్వరు లుండవచ్చును. అందువలననే మేరువున కింతమాత్రమయిన పుణ్యముగలిగినది. ఇచ్చట ప్రకృతిపురుషులుగలరు. మా ఆచార్యుడో, ప్రకృతి పురుషులకు విలక్షణమగు శుద్ధ శివస్వరూపుడు. అదిన్నిగాక ఏకప్రదేశమున శివుడుండుట వలననే, మేరువున కింత యోగ్యత గలిగినది. అట్లుండగా మా దేశికుడా! సంపూర్ణ శివస్వరూపుడుగదా! కాన,

యీ దృష్టాంతమున్ను సరిపడదు. అంతేగాక, మేరుగిరిలో క్రూరములగు అనేక సింహశార్దూలాది భయంకర జంతువులు గలవు. మాగురు దేవుని యందో, శాంతసత్య కరుణాది అనేకసుగుణములు గలిగియున్నవి. అప్పుడే లాగున సమానముగా వర్ణన జేయవచ్చును. కాగ అత్యంత విరుద్ధ ధర్మములకు ఎట్లు, ఉపమాలంకారము సంభవించును. అందుచేతను నిది సరిపోదు. మఱియు మేరుగిరిలో అనేక దేవతలు గంధర్వులు కిన్నరలు కింపురుషులు, తమతమ భార్యలతో క్రీడించుచుందురు. మా గురువరుని ఆశ్రమమున అనేక స్త్రీ పురుషులుండినను వారంఋను ఆత్మారాములై ఆత్మయందు రమించువారేగాని విషయా సక్తులుగారు. ఈకారణము వలన ఆ దృష్టాంతము సరిపడదు. అదియునుగాక మేరుగిరియందుండి అనేక స్రోతస్సులు ప్రవహించుచుండును. అవన్నియు వట్టి నీళ్లే గాని మఱియొకటి గాదు. మా ప్రభువగు గురువునుండే సద్జ్ఞాన ప్రవాహమే గలుగుచుండును. దానినిపానము జేసినవారికి మరల జననమరణములే యుండవు. మేరుగిరినుండి యుద్భవించు గంగా ప్రవాహము కొంతసేపు మాత్రమే దాహమును శయింప జేయును. మరల కొంతసేపు అగునప్పుడు మరల దాహముపుట్టును. మాగురుదేవుని ముఖారవిందమునుండి వెడలుచుండు జ్ఞానగంగను పానముజేసినవారికి మరల యేకాలమందైనను తాప్రత్రయాగ్నిచే నేర్పడిన దాహముండదు. అదియునుగాక, గంగా నదిలో మునిగినవారికి శరీరమాలిన్యము నశించునేగాని, ఆత్మలో గల అజ్ఞానమలము రహితము గాదుగదా! ఆగురుదేవుని బోధనారూపమగు గంగా ప్రవాహములో స్నానమొనరించినవారి జన్మజన్మాంతరములలో నుండి హృదయాంతరాళమున గల అజ్ఞాన మాలిన్యమంతయు, తత్క్షణము లోనే రహితమై శుద్ధ జ్ఞాన స్వరూపులగుదురు. అప్పుడు దానికన్ని దీని కిన్ని యేమిసామ్యము గలదు. కావుననే యీ దృష్టాంతము సరిపోదు. ఇందువలన ఎట్లు జూచినను, శ్రీగురుని ఎట్లుస్తోత్రము జేయుటకు తోచుటలేదు. కావున మానావలంబనమే శరణ్యముగా తోచు చున్నది. మరియు మేరుగిరిలో అనేక ప్రదేశములలో మూషికములు రంధ్రములు జేసి నివసించుచున్నవి. కొన్నిటిలో విష పూరితములగు నాగు పాములు గూడ వాసము జేయుచున్నవి. ఇది యిటులుండగా మా

గురుదేవుని దేహములో ఏలాటివిషయ దోషములుగాని దుర్గుణములు గాని లేవు. యీ తాపత్రయ మునియందు సర్వావయవములలోను, సర్వ ద్వారములలోను కట్టకడకు రోమ కూపములలోసహా దయాదాక్షిణ్యాది పుణ్య గుణములు తప్ప మరియేమియు ఎంతవెతికినను కానుపించునా? ఓహో! ఇట్టిపుణ్యాత్మునికిన్ని రాళ్ల గుట్టలతో గూడిన కొండయగు మేరు గిరికిన్ని సమన్వయపరచ చూచుట యుత్తర దక్షిణ ధ్రువముల యందు దూరమేగాను పించుచున్నది. కావున యీసమాధానమున్ను సరిపడదు. మఱియు మేరుపర్వతాంతర్భాగమున ఎంత వెతకినను, రాళ్లు, మట్టియే గాను పించును. మాగురు దేవుని హృదయాంత రాళములో జూచిన బ్రహ్మభావము, కరుణ, వేదార్థసారము, "అహంబ్రహ్మాఽస్మి" అను వేదసారమే కనుపించును. ఉపనిషదర్థమును చింతనజేసెడి ఆ స్వచ్ఛమై ప్రశాంతమగు గుణమే కానుపించును. కావున మేరు దృష్టాంతము యెంత మాత్రము సరిపడదు. అందువలన వర్ణనాతీతుడగు గురుదేవుని వర్ణించు టయు, స్మరించుటయు మననము జేయుటయు అపచారమని, శ్రీదత్తా త్రేయులు వచించి యున్నారు.

శ్లో॥ త్వద్యాత్రయావ్యాపకతా హతా తే
ధ్యానేనచేతః పరతా హతాతే
స్తుత్యాత్వయా వాక్పరతా హతాత్తే
క్షమస్వనిత్యం త్రివిధా పరాధాన్.

తా॥ అదియునుగాక మేరుగిరిని భక్తులు ప్రదక్షిణమును జేయు దురు. ఆలాగున శ్రీగురుదేవుని ప్రదక్షిణము చేయదలంచిన ఆదియు అపచారమే. ఎండుకన అనంతుడగు గురుమూర్తిని సాంతుని జేయుటగదా. అనగా హద్దుగలదానికి ప్రదక్షిణముజేయ సాధ్యపడును. ఆలాగున వేద ములకు అతీతమగు ఆపరమ గురుస్వరూపమును స్తోత్రమును జేయదలం చుటగూడ అపచారమే యగును. ఏలన అవర్ణనీయుడగు ఆగురుదేవుని వాక్కుతో యెటులవర్ణింపగలము. అదిన్నిగాక మనస్సులో ధ్యానింప దలించినను అదిన్ని అపచారము. యేలనన ధ్యానించెడు వృత్తి బుద్ధికి సంబంధించినది. బుద్ధికతీతుడగు పరమగురు స్వరూపమును బుద్ధియెటుల ధ్యానించగల్గును. అదిన్ని గాక ధ్యానముచేసెడు బుద్ధియు, వర్ణించెడు

వాక్కున్ను ప్రదక్షిణము జేయుపాదములు గూడ అచేతనములు. వాటి నన్నింటిని చేతనాస్వరూపములుగ జేయు ఆబ్రహ్మ చైతన్యమగు గురు స్వరూపము గదా! ఇది యెటువంటి దనగా ప్రభువు పుణ్యకాలమున దానముకొఱకు నిశ్చయించిన ధనధాన్యాదులను సేవకుడు దానము చేయుచు తానుస్వంతముగ మహాదాతయని తలంచునట్టుల అపచారము గదా! కావున నాకుయేవిధముగ జూచిన ననుమానముతప్ప మరియే యుపాయముతోచుటలేదు. అనిగద్గదస్వరముతో చెప్పుచు నిర్వికల్ప సమాధి నిష్ఠలోయుండు మునివలె యూరికే మట్టిలో కూరుచుండెను. దీనిని జూచి సభలో యుండు సర్వ స్త్రీ పురుషులున్ను ఏకధ్వనితో ఆనంద బాష్పముల కార్చుచు మహానుభావా! చిరకాలము ధ్యానధారణాది యోగధారణలతో సహా మనోనిగ్రహము కొఱకు యత్నించెడు మునులకు గూడలభించని ఆ పరమోపరతి అనిర్వికల్ప సమాధియు సులభముగా మీదర్శనమువలనను మీయొక్క పవిత్రవాక్యముల వినుటవలననుమాకు లభించెను. అని చెప్పుచు అందఱును ధ్యానములో నిశ్చేష్టులై కూరు చుండుచు బ్రహ్మానంద వారాశిలోమునిగి పోయిరి.

---

ఓమ్.

# 5. అగ్ని దృష్టాన్తము

సర్వేన్ద్రియ నిరోధము గలిగి నిశ్చేష్టితుడై యుండు ఆభక్తసత్తముడు మబ్బునుండి పూర్ణచంద్రుడు మెల్లమెల్లగబయటవచ్చునటుల ప్రసన్న ముఖముతోను ప్రశాంతభావముతోను ఓం, ఓం, ఓం, అని నెమ్మదిగ ఉచ్చరించుచు నిమీలితనేత్రుడై యీలాగున గురుస్తుతిజేసి లేచి నిలిచెను.

శ్లో॥ న గురోరధికం న గురోరధికం న గురోరధికం న గురోరధికమ్
శివశాసనతః శివశాసనతః శివశాసనతః శివశాసనతః.

తా॥ శివునిసాక్షిగా గురువుకంటె అధికమైనది లేదు. శివునిసాక్షిగా గురువుకంటె అధికమైనది లేదు. శివునిసాక్షిగా గురువుకంటె అధికమైనది లేదు. శివునిసాక్షిగా గురువుకంటె అధికమగునది లేదు,

శ్లో॥ ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివమ్
హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతః.

తా॥ హరిసాక్షిగా యీగురుమూర్తియే శివము. విష్ణుసాక్షిగా ఈగురుమూర్తియే శివతరము. శ్రీమన్నారాయణునిసాక్షిగా ఈగురుమూర్తియేశివతమము. భగవంతునిసాక్షిగా ఈగురుమూర్తియే శివమయము.

శ్లో॥ విదితం విదితం విదితం విదితం విజనం విజనం విజనం విజనమ్
విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతః.

తా॥ బ్రహ్మసాక్షిగా గురుమూర్తియే ఏకమైనదని తెలియబడినది.
బ్రహ్మసాక్షిగా గురుమూర్తియే ఏకమైనదని తెలియదగినది.
బ్రహ్మసాక్షిగా గురుమూర్తియే ఏకమైనదని తెలిసికొనదగినది.
బ్రహ్మసాక్షిగా గురుమూర్తియే ఏకమైనదని తెలివిగలిగినది.

ఈలాగున మందస్మితవదనారవిందుడై నెమ్మదిగ్రహించెడు గంగవలె మరల చెప్పఁదొడఁగెను

ఇప్పుడు అగ్నిని దృష్టాంతముగాగొని గురుదేవునిస్తుతింపఁజూచిన అదియు అసలేసరిపోదు. ఒకవేళ అగ్నికట్టెలను కాల్చివేయుశక్తిగలదైనను అజ్ఞానకట్టెలను దహింపజేయుశక్తి అగ్నియందుగలదా! ఇదిటుండగా అజ్ఞానేంధమును భస్మమొనర్చెడు మహిమగల మా గురుదేవుని అగ్నితో యెటులదృష్టాంతమునుచెప్పవచ్చును. కావున యీ దృష్టాంతము సరిగాదు. అట్లుగాక అనేక సంవత్సరములునుండి అరణ్యమునపడియుండు ఇంధనములనుబూడిదెగాజేయశక్తి నిప్పునకుగలదని అంగీకరించినను అదియు సరిగాదు. చాలసంవత్సరములనుండియేర్పడియుండు ఈస్థూలమయినకట్టెలను అగ్నిబూడిదజేయునుగాని సూక్ష్మమై జన్మజన్మాంతరములనుండి వచ్చుచుండు కర్మరాసియను కట్టెలను యీవహ్ని ఎట్లుదహింపజేయుగల్గును? కావున యీదృష్టాంతము ఎట్లు మాగురుదేవునికి జెప్పవచ్చును?

మాతండ్రియగు గురుదేవుడో, అనేక జన్మజన్మాంతరముల నుండి కొండలు కొండలుగా పెరిగియుండు కర్మ కట్టెలనన్నిటిని తనజ్ఞాన దృష్టియనెడు అగ్నిచే భస్మమయముగా జేయగల్గును గదా! అట్టిమహాత్మునినే నెట్లు యీఅనలముతో సరిసమానముగాచెప్పగలను. మఱియొక విధముగా ఆలోచించినను సమత్వముకుదురుటలేదు. ఏలననగా మహారణ్య

మును ఈ అగ్నిహోత్రుడు భస్మమొనర్చినను మొనర్చుగాక, కాని అంతు కనఁబడని సంసారారణ్యమును యీ వీతిహోత్రుఁడు ఎటుల దహింప గల్గును? మాగురుదేవుఁడగు మహనీయుఁడు అనాదిగవచ్చుచుండిన సంసారారణ్యము నంతయు తనజ్ఞానాగ్ని వలన భస్మముజేయగల్గును గదా! అట్లుండగా యీ యుపమానమెటుల సరిపోవును. కావున యిట్టి అగ్ని దృష్టాన్తముతో మాగురుదేవుని యెటుల స్తుతిజేయగలను. అదిన్నిగాక యీఅగ్ని ప్రకాశము రాత్రిలోగల చీకటిని రహితమొనర్చు శక్తి గలిగి యుండినను యుండవచ్చును. హృదయాన్తరాళములోగల అవిద్యయను తమస్సును ఇది యేలాగున రహిత మొనరింప గల్గును. మనస్సులోగల మాయామాలిన్య తమస్సును నిశ్శేషముగా జేయు గురు దేవునికిన్ని యీఅగ్ని దేవునికిన్ని సాదృశ్య మెటుల కుదురును. కాన ఇది సరిపడుట లేదు. ఇచ్చోటనుగూడ మానమే గోచరించు చున్నది. ఇదియును గాక ఈ అగ్ని యెంతశుద్ధమైనదైనను, పరులసహాయముచే వెలుగవలయును. మాగురుదేవుని జ్ఞానాగ్నియో! స్వయం ప్రకాశమయినది. మఱియొకరి సహాయమక్కఱలేదు. ఇట్లుండగా అగ్నికిన్ని మాప్రభువగుగురుదేవునికిన్ని ఎచ్చట సంబంధము గల్గును. ఎచ్చట సమానత్వము ఏర్పడును. అందు వలన యీదృష్టాంతము కొంచమైనను సరిపోవుటలేదు. ఇదిన్నిగాక ఎంత శుద్ధమయిన యజ్ఞాగ్నికాని, దక్షిణాగ్నికాని, గార్హపత్యాగ్నికాని, ఆహనీవయాగ్నికాని, సమిధలు వేయుచుండువఱకు మాత్రమే జ్వలించు చుండును. లేనిచో నింపాదిగా చల్లారిపోవును. జ్ఞానాగ్ని స్వరూపుడగు మాగురుదేవుని ప్రజ్ఞానాగ్ని ఎప్పుడైనా నశించునా? అదిశాశ్వతమయి నదిగదా. యిట్లుండగా దృష్టాంతమేలాగున కుదురును. ఈకారణమువలన యిదియును పొసగదు. అప్పా! గురుదేవా! నేను నిన్నెటుల స్తోత్రము జేయగలను. నాకేమియు తోచుటలేదు. బృహస్పతివంటి వాచాలు డయినను నిన్ను స్మరించునప్పుడు యేమియుతోచక మూకుడై పోవును. శుక్రాచార్యునివంటి మనీషగలవాడైనను నిన్నుతలంచినప్పుడు యేమియు తోచక మూఢుడై పోవుచుండగానే నెటులనిన్ను స్తోత్రము జేయగలను. ఇందువలననే కాబోలు ఋషులందఱు మునులనిపేరు గలవారైరి. అనగా గురుదేవుని యేవిధముగనయినను వర్ణింపజాలక మౌనమును వహించిరని

శోచుచున్నది. ఇదంతయు ఇట్లుండగా అగ్నిగూడ జడస్వరూపము జ్ఞానము దానికి లేదు. మా గురుమూర్తియో జ్ఞానస్వరూపుడు. చైతన్యము గలవాడు. ఇట్లుండగా జడాగ్నికిని చైతన్యాత్మకున్ను ఎట్లు సమానము జేయగలను? ఇచ్చటగూడ గత్యంతరము ఎంత వెదకినను కానుపించుట లేదు. కావుననే యుపనిషత్తులలో "తమేవభాన్తమనుభాతిసర్వం" స్వయముగా ప్రకాశవన్తమయియుండినందువలన దానిననుసరించి తక్కిన వన్నియు ప్రకాశవంతములగుచున్నవని యుపదేశించుటకు కారణము. పరమాత్మతేజస్సుచేతనే తేజోరూపములగు అగ్ని విద్యుత్తు సూర్యుడు నక్షత్రములన్నియు తేజోరూపములయి వెలుగుచున్నవని శ్రుతి తెలుపుటకు కారణము. మఱియొకలోపముగూడ అగ్నియందుగలదు. అదేమనగా తానెల్లప్పుడునుగోప్యముగాను గూఢముగాను గుప్తముగాను దొంగవలె యుండును. అరణి మొదలగువాని సహాయముగా తానుబయటికిరావలసి యున్నాడు మా గురుదేవుడో లోపలను బయటను యొకే విధముగా వెలుగుచుండువాడు. ఇట్లుండ సత్యమునకు అసత్యమునకు ఎట్లు సమత్వము గల్గును. అంధకారప్రకాశములకు యే ఉపమాశాస్త్రమయినను సమన్వయమునుజేయుగల్గునా? ఇచ్చటగూడ నే నేమియుజెప్పజాలక పోవుచున్నాను. మఱియు అగ్నిదేవుడు ఎల్లప్పుడును గాలికిభయపడి వాయువు త్వరపడని గోప్యప్రదేశముననే కూరుచుండును. యీతనికిపవనుడు పరమ శత్రువు. మాగురుస్వామియో అజాతశత్రువువలె యెవరితోను శత్రుత్వము లేనివాడు. కావుననే గాలిలోను గాలిలేనిస్థలములోను యొకేవిధముగా మాగురుదేవుండు విహరించుచున్నాడు. గాలివల్ల అగ్ని బాధింపబడు నటుల జ్ఞానాగ్నిగూడయుండినచో, అదియును అజ్ఞానముచే బాధితము గావలసివచ్చును. అట్లైనముక్తుని ముక్తత్వముగూడ భంగపడినదగును. అట్లైన మోక్షమునకుగూడ అశాశ్వతము సిద్ధించును. దీనిని శ్రుతి అంగీకరింపజాలదు. అప్పుడు పామరునివలె పరమజ్ఞాని సహాపునర్జన్మనొందవలసివచ్చును. బాధితుడగు అగ్నికిన్ని యేకల్పమందైనను అబాధితుడైయుండు మా గురుదేవునికిని యెచ్చట సమానధర్మము పొసగును. ఇట్లుండగానే నెట్లు గురుదేవుని నుతింపగలను. ఇచ్చటనున్ను మానము తప్ప వేఱుమార్గముగానుపించుటలేదు. ఇకయొక లోపముగూడ అగ్ని

యందుగలదు. అదేమన యే అగ్నిహోత్రాదిక్రియలలోగాని హావన ములోగాని యజ్ఞములోగాని హోమించునప్పుడు అతనిభార్యపేరును గూడ గట్టిగ యుచ్చరించినమాత్రమే అగ్నిక్రీతిగల్గును. కావుననే యజ్ఞములలో ఋత్విక్కులందఱుపెద్దగా 'ఓం అగ్నయేస్వాహా ఓంస్వాహా" అని యుచ్చరించుచున్నారు. ఆసభలో అనేక ఋషులు అనేకరాజులు ఇక అనేకపెద్దలు సమావేశమయియుందురు. అచ్చటనుగూడ నిర్లజ్జగా తనభార్యపేరును యుచ్చరించు పద్ధతిగలదు. మాగురుదేవుడో వివాహములేని నైష్ఠికబ్రహ్మచారి. స్త్రీలన్ననో ఆయనకు కొంచమైనను వైరాగ్యమువల్ల యిష్టములేకయున్నది. ఇట్లుండగా వీరుభయులకు ఎచ్చట సమానగుణముగలదు. కావున నేనుగురుదేవునిస్తుతించజాలక మానమును బూనుచున్నాను. అనిచెప్పుచునిశ్చలముగ స్తంభమువలె చేష్టలుడిగి యుండిపోయెను. అప్పుడా మహాసభలోయుండు మహాజనులందఱు నల్లనిమేఘమును జూచిన మయూరములవలె భక్తిపరవశులై, నర్తనము జేయదొడంగిరి. అందఱును ఒక పెట్టున ఓ మహానుభావా! మేము వేద వేదాంత సారములను ఉపన్యసించెడు అనేకపండితుల బోధలను మహా సభలో అనేకసార్లు వినినవారమైనను ఇప్పుడు మాకు గల ఆనందమును ఎప్పుడు అనుభవించి యుండలేదు. మాపూర్వజన్మ కృతపుణ్యమంతయు ఇప్పుడు ఫలించినది. అని తలంచుచున్నాము.

శ్లో॥ అజ్ఞానేనాహినాగ్రస్తాఃప్రాణినస్తాన్ చికిత్సకః
విద్యాస్వరూపో భగవాన్ తస్మై శ్రీగురవేనమః.

తా॥ అజ్ఞానమను సర్పముచే కఱవబడిన ప్రాణికోట్లకు చికిత్సజేసి విషయమను విషరాహిత్యము నొనర్చినవాడును, విద్యాస్వరూపుడును, భగవంతుడగు శ్రీగురుమూర్తి కొఱకు నమస్కారము.

శ్లో॥ హేతవే జగతామేవ సంసారార్ణవ సేతవే
ప్రభవే సర్వవిద్యానాం శంభవే గురవేనమః.

తా॥ జగమునకు హేతువుగను, సంసారమునకు సేతువుగను, సకలవిద్యలకు ఉత్పత్తిస్థానముగను, శంభువుగను అయిన గురువు కొఱకు నమస్కారము, అని స్తుతించిరి. ఓమ్

---

# 6. బ్రహ్మ దృష్టాంతము.

ఓమ్ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః.

ఈలాగున గురుధ్యానము చేయుచు చిన్నగచిన్నగా ఓమ్. ఓమ్ ఓమ్. అనిఅనుచూ ఉదయగిరిపై సూర్యుఁడు నిదానముగా ఉదయించు నట్లు నేత్రము తెఱచుచు ముఖమందు దివ్యకాంతిని ప్రసరింపచేయువాడై ఈలాగున చెప్పఁబోడంగెను. యిచ్చటబ్రహ్మదృష్టాంత మనునది, చతుర్ముఖబ్రహ్మను గురించినదనిజ్ఞప్తి నుంచవలయును. అట్టి బ్రహ్మతో మా గురుదేవుని యెట్లు సాదృశ్యముగా నేను వచించగలను. ఏలన ఈగురు ధ్యానమున మొదట గురుని బ్రహ్మయనియు మఱలవిష్ణువనియు పిమ్మట మహేశుడనియు తరువాత పరబ్రహ్మమనియు స్తోత్రము చేయడమైనది. మొదట ముగ్గురు మూర్తులను గుఱించియు తరువాత పరబ్రహ్మను గురించియు స్తుతించడమైనది. యిదియే సరియైన పద్ధతి. కట్టకడకు సాక్షాత్పర బ్రహ్మమునే గురువుగా నిశ్చయించెను. ఇట్లుండగానే నేలాగు యీసత్య లోకనివాసియు సరస్వతి భర్తయునగు బ్రహ్మదేవుని మాగురుదేవునితో సమానముగా జేసి స్తుతించగలను? కావున యీ దృష్టాంతమున్ను సరియైనదిగాదు. ఏలనన భూలోకములో జేసిన యోగవిద్యా మహిమచేతను హిరణ్యగర్భోపాసన వలనను బ్రహ్మలోకమును పొందుచుందురు. ఆ బ్రహ్మలోక మొక పరిమితి స్థలము. అంతేగాక బ్రహ్మదేవుని ఆయుఃపరిమితియు శాస్త్రము తెలుపుచున్నది. అప్పుడు కాలముతోను దేశముతోను గూడిన బ్రహ్మదేవుఁడు ఎట్లు సర్వజ్ఞుడును శాశ్వతుడున్ను గాఁగలఁడు. యిందువల్లను నాగురుదేవునితో సమానముగా యీబ్రహ్మదేవుని వర్ణన జేయఁగలను? కావున నా గురుదేవునెట్లు స్తోత్రము జేయఁగలనని తోచుటలేదు.

శ్లో॥ సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః
రాత్రిఁయుగసహస్రాం తాం తేఽహోరాత్రవిదో జనాః.

తా॥ యేజనులు యేపగటిని వేయియుగములు గలిదిగాను, యే రాత్రిని వేయియుగములు పరిమితిగలిదిగాను, నెఱుంగుచున్నారో, అట్టి

వారు చతుర్ముఖ బ్రహ్మయొక్క అహోరాత్రముల నెఱింగిన వారగుదురు. అనగా మనుజుల వెయ్యియుగములు బ్రహ్మదేవునికి ఒక్క పగలనియు, ఆలాగున వేయియుగము లొక్కరాత్రియనియు, చెప్పబడు చున్నది.

మఱియు యొక్క గొప్ప రహస్యము గలదు. బ్రహ్మదేవుడు సరస్వతీదేవిని భార్యగాజేసికొన్నాడు. మాగురుదేవుడో నైష్ఠికబ్రహ్మచారి, ఇట్లుండగా మీరుభయులను సమాన మొనర్చి నేనెట్లు స్తోత్రము జేయగలను?

ఇట్టి కారణముచే శ్రీ సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతాది నలుగురు మహాయోగులు అఖండ బ్రహ్మచారులు, బ్రహ్మసాక్షాత్కార విషయములో సందేహముగలిగి సందేహనివృత్తి కొఱకు బ్రహ్మలోకమునుబొంది బ్రహ్మకు సాష్టాంగనమస్కారమొనర్చి సవినయముగా యీలాగున ప్రశ్నించిరి. జీవేశ్వరులు అభిన్నులా? లేక భిన్నులా? యనితమకుఁ గలసందేహముల నివృత్తి జేయవలయునని ప్రార్థించగా యదిసామాన్యుల కర్థముగాదనియు, గొప్పయోగులు చిరకాలము జేసిన తపస్సువల్ల యంతఃకరణ శుద్ధిగల్గి ఆత్మయొక్క యావరణము నశించినప్పుడే గోచరముగాగలదనియు, దానికివైరాగ్యమే ముఖ్యముగా యుండ వలయుననియు గంభీరముగా చాలసేపు అగాధార్థములతో బోధింపగా బ్రహ్మదేవునికి చెమటబుట్టునది చూచి సరస్వతీ దేవి వచ్చివిసరుచుండెను. ఇది చూచిన సనకాది ఋషులు పరస్పరము ముఖావలోకనముజేసి తలలువంచి తిన్నగాఱునవ్వునవ్విరి. యీతత్వము వెంటనే చతుర్ముఖ బ్రహ్మగనుఁగొని కొంతసేపు మౌనముగానుండి సనకాదుల నుద్దేశించి మునులారా! యెప్పుడు మీరు నా విషయములో సందేహముగల్గెనో యిక నే నెంతచెప్పినను ప్రయోజనములేదు. కావున మీరును మరొకగురువు నాశ్రయించు కొనవచ్చునని పలికి మౌనముగా నుండినట్లు శాస్త్రమునందు గలదు. కావున బ్రహ్మదేవుడు గొప్పవాడు గానే యుండవచ్చును. సందేహములేదు. ఈ మహాత్మయిన బ్రహ్మాండముయొక్క సృష్టిని జేయవచ్చును. నాలుగు వేదములను నిర్మింప వచ్చును. అట్టి మహిమలెన్నియో యుండవచ్చును. కాని జీవన్ముక్తికి

కారణమైన వైరాగ్యము లేనందుచే యీ విషయములో ఆయన పనికి రాడు. అందువల్ల మోక్షమును సాక్షాత్తుగాబొందిన మా గురుదేవునితో సమానముగాగాని యధికముగా గాని జేసి నే నెట్లుస్తుతించగలను. ఎల్లప్పుడుపమాలంకారము సమాన ధర్మముగాని యధికధర్మముగాని యుండవలయును. అట్లుగాని నెట్లుపమాలంకారమగును. ఇందువల్లను నే నెట్లు గురుని నుతిజేయగలనని తోచుటలేదు. కావున మౌనము తప్ప వేఱుమార్గము గనుపించుటలేదు. ఇదియునుంగాక బ్రహ్మదేవునకు శ్రీమన్నారాయణమూర్తి గురుడని ప్రమాణమునందు గలదు. 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యో వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' అని వేద వాక్యము. ఏ విష్ణుమూర్తి ప్రథమమున బ్రహ్మనుసృష్టించి అట్టి బ్రహ్మదేవునకు వేదముల నుపదేశించెనో యట్టి మహావిష్ణువునకు నమస్కారము. యిదియే పై వాక్యమునకర్థము. ఇట్లుండగా యీ బ్రహ్మదేవుని ఆదిగురుడుగా నెట్లుజేయ వచ్చును. ఒకరిపై మఱియొక రధిపతిగా నుండగా నెట్లు అతడు స్వతంత్రుండగును. పరాధీనుడెట్లు స్వయంభూయగును. ఏలాగున సర్వజ్ఞుడగును ఇట్టి కారణమువల్లను స్వయంప్రకాశుడున్ను స్వయంభువునగు మా యాచార్యునితో సమానముజేసి నే నెట్లుస్తుతింప గలను? మఱియు వేదములోను శాస్త్రములోను అనేక విధములగు యజ్ఞములు విధింపబడియున్నవి. వాటిలో చాలభాగము పశుహింసతో గూడినది. అదిన్నిగాక యట్టియజ్ఞమువల్ల నశ్వరమగు విషయభోగములతోగూడిన స్వర్గలోకమేగల్గును. పోని అట్లైనను ఆ స్వర్గమైననుశాశ్వతమైనదిగాదు. పుణ్యము నశించువఱకు మాత్రమే యుండును. మఱల భూలోకమున జన్మముగలుగును. కావుననే గీతలో "క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి" యని శ్రీకృష్ణభగవాను లుపదేశించుటకు కారణమైనది. ఇదియునుంగాక గీత రెండవ యధ్యాయమున యజ్ఞమును గుఱించి నెట్లు నిందించుచున్నదో చూడుడు.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్

తా॥ ఓ అర్జునా! వేదములు త్రిగుణాత్మికములగు సంసారవిషయములను దెలుపునవి గానున్నవి. అట్టి కారణవల్ల నీవు త్రిగుణాత్మక

ములగు విషయములయందు వదలినవాడవుగను కేవల సత్వగుణవిశిష్టు డవుగను సుఖదుఃఖాదిద్వంద్వముల సహించు వాడవుగను యోగక్షేమ ములను సహితము కోరని వాడవుగను, ఆత్మజ్ఞానము గలవాడవుగను, కమ్ము.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః.

తా॥ ఓ అర్జునా? ఆత్మ జ్ఞానము లేనివారు, వేదమునందు గల యర్థవాదము లందాసక్తులై స్వర్గాదిసుఖములకన్న యితరమైనది లేదని వాదించెడు స్వభావముగలవారగుచు ప్రసిద్ధమై పూసిన మోదుగచెట్టు పూవులవలె రమ్యమైయున్న యేవాక్యములను జెప్పుచున్నారో- దానిని నమ్మకుము? మోదుగపుష్పముగాని యెఱ్ఱబాడిశ చెట్టు పూవుగాని చూచి నప్పుడు కడు రమ్యగా నుండినను నవి పూజాదుల కుపయోగపడునవి లేక సువాసగలవిగాని, కట్టకడకుపయుక్తమగు ఫలముగాని ఎట్లుగావో యీబ్రహ్మదేవుడు సృష్టించిన యజ్ఞాదిక్రతువులన్నియు అటువంటివే. అదిన్నిగాక ప్రాణిహింసతోగూడిన క్రియలను నిర్మించిన బ్రహ్మదేవుడెట్లు దయాస్వరూపుడగును. దయలేని వానికి మోక్షమెట్లు గల్గును. ఒకవేళ బ్రహ్మనిర్మితవేదమందు హింసయుండక పోవచ్చును. అర్థముఁవ్రాసినవారు హింసతోగూడిన భాష్యమొనర్చిరి. అట్టివారిని బ్రహ్మయేల పుట్టించ వల యును. లేక వారిని గర్భములోనే యేలనశింపజేయక పోయెను. ఒకవేళ జన్మించినను అప్పుడేయేల చంపకపోయెను. అట్లైన బ్రహ్మనిర్మిత వేద ములో యీహింసాదోషము నాపాదింపజేసి బ్రహ్మదేవుని అవమానము జేయక పోయియుందురుగదా? ఒకవేళ వేదములో గల ఋక్కులకు పశు హింసాపరమగు యర్థముండక పోయినను, అర్థముఁవ్రాసినవారు హింసా పరముగా లిఖించియున్నారుగదా! సామాన్య జనులకు అర్థము తెలుసు కొనెడి యోగ్యతయైనను, చాలినంత లేకయుండునప్పుడు మూలములగు ఋక్కులకెట్లు నిరుక్తప్రకారము అర్థము తెలుసు కొనగలరు. బ్రహ్మదేవుడు త్రికాలజ్ఞుడైనచో తనచే నిర్మింపంబడిన వేదమునకపార్థము యిట్టి వారు చేయగల్గరని తెలుసుకొని పై జెప్పిన మూడు ప్రకారములో నొకదాని

నైనా ఏల అవలంబించక పోయెను. కావుననే కృష్ణ భగవానులు యిట్టి కర్మయజ్ఞమును నిరసించి యాత్మ యజ్ఞమును దెలుపుటకు కారణమైనది. గీతనాల్గవ అధ్యాయమున 14 విధములగు యజ్ఞములను భగవానుడు పదేశించెను. దీనియందు హింసయేదైన గలదా? కావుననే గీతలో "యజ్ఞానాంజపయజ్ఞోఽస్మి" అని ఉద్ఘాటించుటకు కారణమైనది. యజ్ఞము లన్నిటిలోను జపయజ్ఞమే శ్రేష్ఠమనియు, అది విష్ణుస్వరూప మనియు కృష్ణభగవానుడు తెలిపెను. ఇదియిట్లుండగా మాగురుదేవు డాత్మ యజ్ఞముగలవాడు. ఒకప్రాణికైన దానివల్ల హింసలేదు. మఱియు ఒక్కరిసహాయముండ నవసరములేదు. ఏవిధమైన ధనముతోను సంబంధములేదు. ఋత్విక్కులు, ఉద్గాతలు మొదలగు వారెవ్వరున్ను అవసరములేదు. దీనివల్ల గలిగెడు ఫలము మోక్షము. అది జననమరణ రహితమైనది. బ్రహ్మదేవుడుపదేశించిన యజ్ఞము జరానెరలులేని ఫలమును గలుగ జేయునదియైనను, జననమరణములతో గూడినది. విశేషధనముతోను, జనముతోను సంబంధించినది.

అదియునుంగాక సర్వులకును హక్కున్నది. యీ ఆత్మయజ్ఞమో బ్రహ్మానందము గలుగజేయునది. అదిన్నిగాక సర్వులకున్ను సుసాధ్యమైనది. అంతేగాక యీకర్మయజ్ఞమును జేయువారు చేయుయమృతపాన మెట్టిదన సోమలతచే జేయబడిన ఒకవిధమగుకల్లు. హోమముచేసి మిగిలిన నేతిలో వేయించిన మేక మాంసము. ఓహో! దీనియొక్క మహిమ విజ్ఞులే తెలిసికొనఁగలరు. ఆత్మయజ్ఞముచే జీవించియుండునప్పుడే, బ్రహ్మానందామృతపానమున్ను కైవల్యపదవియు గలుగుచున్నది. దేహానంతరము ముక్తియు లభించును. కావుననే శ్రీ గౌతమ బుద్ధుడు హింసతో గూడినయీ యజ్ఞాదిక్రతువులను త్యజించవలసి వచ్చినందుచే యీ విషయముల దెలిపెడు వేదవాక్యములనుగూడ అప్రామాణ్యముగ జూడవలసివచ్చినది. సత్యాన్వేషులందరు ఆలాగుననే జేయుదురు. కాని వేదములలోగల పవిత్రవాక్యము లన్నిటిని శ్రీ గౌతమ బుద్ధుడు నొకదానినైనను విడవక ఆచరణలోనే పెట్టెను. తనశిష్యులకున్ను లోకములో జనులకున్ను దానినేయుపదేశించెను. దీనికన్న వేదవాక్య ప్రామాణ్యాంగీకారమేమి యుండవలయును. వేదములలోగల గద్య పద్యములను

మాత్రముపేక్షించి వేఱుగ సారాంశమును గద్య పద్యములుగా గౌతమ బుద్ధుడుజేసెను. ధర్మపదము మొదలగు బౌద్ధగ్రంథముల జూచినవారి కందఱకును యీ సత్యముగోచరించును. దీనిని తెలిసికొనక బుద్ధుడువేద నిందకుడనియు దైవదూషకుడనియు సత్యమెఱుంగనివారు చెప్పుదురే గాని, నిజమెఱింగిన వారెవరును నట్లుజెప్పరు. బుద్ధుడు చెప్పిన దానిలో సత్యములేనిచో యింతకాలము లోకములో బౌద్ధధర్మము నిలువగలదా? ఒకవేళ భారతదేశమందు బౌద్ధమతము కొంతసన్నగిల్లినను, చైనా, బర్మా జపాన్, టిబెట్ దేశములన్నిటిలోను ఇప్పుడుగూడ బౌద్ధధర్మ మున్నత స్థితిలోనే యుంటున్నది. భరతఖండమున బౌద్ధమతమునకు కొంతగ్లాని కలుగుటకు బుద్ధదేవుని తరువాత యుండిన భిక్షువులలోగల ఆచరణ లోపమే కారణమైనది. అందువల్ల కొంతపతనము గల్గినదేగాని ఆలోపము మతములో గలదిగాదు. హిందూపురాణము లన్నిటిలోను శ్రీ బుద్ధావ తారము నారాయణుని యవతారమనియే గనబడుచున్నది. అట్లుండగా బౌద్ధమతమెట్లంగీకారముగాదు. ఇది ఒకటియే మనకు చాలును. శ్రీ బుద్ధుడు సత్యమును దయను తపస్సును స్వాధ్యాయమును సమత్వమును త్యాగమును కట్టకడకు నిర్వాణమునుగూడ యుపదేశించెను. ఇందువల్ల హింసా కర్మకాండ పరులకు శ్రీ బుద్ధునిపై బుద్ధదేవుని తదనంతరము ద్వేషము గలిగెను. అంతదూర మెందుకు పోవలయు. యిప్పుడుగూడ గ్రామదేవతా జాతరలలో జఱిగెడు రాక్షస హింసాపరత్వమున్ను పై శాచికకృత్యమున్ను చూచిదయాళురగు అహింసా వ్రతనిష్ఠగల యనేక పుణ్యజీవులు అట్టి హింసాపరమగు యారాధనలను నిరోధింప జూచిన అట్టివారిపై యెన్నియో యవమాన కార్యములను పామరులు జరుపు చున్నారు. అదిన్నిగాక బాధించుచున్నారు. ఇట్టి స్వభావము గలవారే బుద్ధునియొక్క పవిత్రమతమును గూడ నాస్తికమని చెప్పువారు. కావున యీలాటి అనేకకారణము లుండుటవల్ల చతుర్ముఖ బ్రహ్మ దేవునితో సమానముగా మా గురుదేవుని స్తోత్రము జేయజాలను. గావున యిచట గూడ మౌనమేనాకుగతియని తలంచుచున్నాను. ఈలాటి ధర్మబోధలను కుంభవృష్టివలె వర్షింపజేసి తాను నిలుచుచున్న స్థానములోనే నిశ్చలుడై తురీయపదమందు నిలకడ గలవాడై యుండెను. ఇట్టి ధర్మబోధలను విని

విని హృదయానందభరితులై ఆ మహాసభలోయుండు భూపాలగోపాలురున్ను గృహస్థ సన్న్యాసులున్ను బ్రాహ్మణ బ్రాహ్మణేతరులున్ను స్త్రీ పురుషులందరున్ను చంద్రోదయమును నిరీక్షించుచుండి నిశ్చలములుగానుండు చకోరపు పక్షులవలె యేకాగ్ర చిత్తము గలవారై ఆ మహానుభావునిముఖమును నిరీక్షించుచు ఆపవిత్రాత్ముని ముఖారవిందమునుండి యిక యేపావన వాక్యము రాగలదాయని తదేకనిష్ఠ గలవారై యుండిరి. అట్టి ఆత్మసుఖము ఎట్టిదోచూడుడు :—

## సుఖములలోగల భేదము.

అనగా మనుష్యానందము మొదలు బ్రహ్మానందము వఱకు గల ఆనందముల దెలియందగినది. బృహదారణ్యకోపనిషత్తున దీనిని విస్తారముగా దెలియనగను. ఇచ్చట మూలముతోసహా వ్రాసిన గ్రంథము పెరుగుననితలంచి తాత్పర్యము మాత్రము వ్రాయడమైనది.

శ్లో॥ న సుఖం సార్వభౌమస్య విద్యతే న బిడౌజసః
బ్రహ్మణో న సుఖం యత్స్యాత్ పుంసః కామవిమర్జనాత్.

తా॥ చక్రవర్తికిని, దేవేంద్రునకును, బ్రహ్మదేవునకుగూడ గలుగని సుఖము సర్వకామనారహితుడగు యోగికి గలుగుచున్నది.

ఇచ్చటనుండి మనుష్యానందము మొదలుగాగలవాటిని దెలిపెద.

1. మనుష్యానందము = యౌవనము, సాధుత్వము, వేదాధ్యయనము పరిజనము, శరీరదార్ఢ్యము, ధైర్యము, బలము, భూమినంతటినినేలుశక్తి సంపూర్ణధనము, అనుకూలవతులగు స్త్రీలు, అను నీమొదలగు గుణములుగల యొకమనుష్యుని ఆనందము మనుష్యానంద మనబడును.

2. మనుష్యగంధర్వానందము = ఇట్టిమనుష్యానందముకన్న నూరింతలు అధికము మనుష్యగంధర్వానందము.

3. దేవగంధర్వానందము = మనుష్యగంధర్వానందమునకన్న నూఱురెట్లు అధికమగునది. దేవగంధర్వానందము.

4. పితృదేవతానందము — పైజెప్పిన దేవ గంధర్వానందమునకన్న నూఱురెట్లు అధికమగునది. పితృదేవతానందము—

5. అజాన దేవతానందము — పై జెప్పిన పితృదేవతానందముకన్న నూఱురెట్లధికము అజాన దేవతానందము.

6. కర్మదేవతానందము = పై జెప్పబడిన అజాన దేవతానందము కన్న నూఱు మడుంగులు ఎక్కువయినది. కర్మదేవతానందము.

7. దేవేన్ద్రానందము — ముందుజెప్పబడిన ఆనందముకన్న దేవతల కధిపతి యగు దేవేన్ద్రానందము నూఱుపాళ్లు ఎక్కువయినది.

8. బృహస్పత్యానందము — దేవగురువగు బృహస్పతి యొక్క ఆనందము పై జెప్పిన దేవేన్ద్రుని ఆనందము కన్న నూఱంశములు ఎక్కువయినది.

9. ప్రజాపత్యానందము — పై జెప్పబడిన బృహస్పత్యానందమునకన్న నూఱుభాగములు ఎక్కువయినది. ప్రజాపత్యానందము.

10. బ్రహ్మానందము = పైన నిరూపింపబడిన ప్రజాపతి యొక్క ఆనందము బ్రహ్మానంద సాగరములో నొకలవలేశమే యగును. అట్టిబ్రహ్మానందసుఖమునే నిరంతరము బ్రహ్మనిష్ఠుడగు ఆత్మజ్ఞాని అనుభవించుచున్నాడు. ఈలెక్కలు సరిగాసంఖ్యవేసిన బ్రహ్మానంద సుఖమెట్టిదో, ముముక్షువులు భక్తులు యోగులు విరక్తులు తెలిసికొనగలరు— 1 మనుష్యానందము, 2 మనుష్యగంధర్వానందము, 3 దేవగంధర్వానందము, 4 పితృదేవతానందము, 5 అజానదేవతానందము, 6 కర్మదేవతానందము, 7 దేవేన్ద్రానందము, 8 బృహస్పతి—ఆనందము, 9 ప్రజాపతి—ఆనందము 10 బ్రహ్మానందము, ఈఅన్ని ఆనందముల యొక్క మొత్తమునే పరమభక్తుడగు మన గురుభక్తుడైన మహాత్ముండిప్పుడు అనుభవించుచున్నాడు. సర్వమానవులయందును ఇట్టిఆనందము యుండిగూడ మాయతో మూయబడి యుండుటచే జనులు తెలిసికొనజాలక యున్నారు. సూక్ష్మమగు వట బీజము స్థూలముగా మహావృక్షమై పరిణమించు నప్పుడెటులయుండునో అణుప్రాయమగు అగ్నికణము ప్రజ్వలింపజేసిన అపారముగ ఎటుల వెలుగుచుండునో, ఆలాగున హృదయ గుహాయందుండు ఆత్మనుగూడ వైరాగ్యాద్యనుష్ఠానములచే విస్తరింప జేయుమహాత్ముండు అట్టి స్థితిని పొంద గల్గును.

ఓమ్.

శ్లో॥ సచ్చిదానందరూపాయ వ్యాపినే పరమాత్మనే
నమః శ్రీ గురునాథాయ ప్రకాశానందమూర్తయే॥

తా॥ సత్తు చిత్తు ఆనందమే ఆకారము గలవాడును, సర్వవ్యాపకుడును, పరమాత్మయే స్వరూపముగా గలవాడును, ప్రకాశానందమే స్వరూపము గలవాడునునగు శ్రీ గురుదేవునకు నమస్కారము.

శ్లో॥ సత్యానందరూపాయ బోధైకసుఖకారిణే
నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే॥

తా॥ సత్యానంద స్వరూపుడును, ఆత్మబోధైక సుఖమును ముముక్షువులకు గలుగజేయువాడును, ఉపనిషద్వాక్యములచే దెలుసుకొనందగినవాడును, బుద్ధికిసాక్షియై యుండువాడును అగు గురుమూర్తి కొఱకు నమస్కారము.

శ్లో॥ నమస్తే నాథ భగవన్ శివాయ గురురూపిణే
విద్యావతార సంసిద్ధ్యై స్వీకృతానేకవిగ్రహ.

తా॥ విద్యను అవతరణ జేయుటకొఱకు గ్రహింపంబడిన యనేక దేహములను ధరించినవాడా! హేనాదా! ఓ భగవంతుడా! శివమై గురురూపమై యేర్పడిన మీకునమస్కారము. అనగా జ్ఞానమును లోకములో యుపదేశించుటకై స్వయముగ శరీరమునుధరించినవాడని తాత్పర్యము. రామకృష్ణాద్యవతార పురుషులవలె స్వమాయచే కల్పింపబడిన దేహధారియై యుండువాడేగాని మాయా పరవశముచే ప్రాకృత జీవులవలె జన్మించిన వాడుకాదని యర్థము.

శ్లో॥ నవాయ నవరూపాయ పరమార్థైకరూపిణే
సర్వాజ్ఞానతమోభేద భానవే చిద్ఘనాయ తే॥

తా॥ సర్వోదితముగాను అనగా యెల్లపుడును నూతనముగా నుండునదియు, పరమార్థమైన యేకరూపము గలదియు, సమస్త అజ్ఞాన తమస్సు రహితమైనట్టి సూర్యుడుగనైనట్టి చిద్ఘన స్వరూపమగు మీకు నమస్కారము.

ఓమ్.

# 7. శ్రీ విష్ణు దృష్టాంతము.

తురీయ పదమందు తన్మయస్థితిలో యుండిన ఆ పరమభక్తుడు నిర్వికల్పసమాధి నిష్ఠలోయుండుయోగి క్రమముగా ప్రాణచలనము గల వాడై నెమ్మదిగా అన్ని యింద్రియములున్ను చైతన్య వంతములై నేత్రము క్రమముగా వికసిత మగునట్లు నిమీలిత నేత్రము గలవాడై ఓమ్. ఓమ్. ఓమ్. అని వేదసారమగు ప్రణవము నుచ్చరించుకొని మెల్ల మెల్లగా మాట్లాడ ప్రారంభించెను. శ్రీ విష్ణుమూర్తితో సదృశముగా మా గురుదేవుని చేసుకొని గురుస్తుతి జేయదలంచినను యదిన్ని సరిపోవుట లేదు. ఏలనన పై చతుర్ముఖ బ్రహ్మనుగుఱించి చెప్పినట్లు శ్రీవిష్ణుస్థానము వైకుంఠమనిచెప్పుదురు. విష్ణుశబ్దార్థమేమన ఆకాశమువలె సర్వవ్యాపక స్వరూపముగల వాడనియు, ఆకాశమువలె యే మాలిన్యమున్ను లేని వాడనియు, నిస్సంగత్వము గలవాడనియు, ఆకాశము సర్వత్రవ్యాపించి యుండియు దేనిని అంటకుండునట్లు చరాచర బ్రహ్మాండ మన్నిటిలోను ప్రాణికోట్ల హృదయములలో వ్యాపించియుండియు దేనితోనుయంటక విలక్షణమై యుండువాడని అర్థమైనను వ్యావహారికమున శ్రీ వైకుంఠములో లక్ష్మీసమేతుడై బ్రహ్మదేవుడు సృష్టించిన దానిని పోషించు వాడని లోకము తెలిసికొనియున్నది. కావున యిదిన్ని మా గురుదేవునితో యెట్లుసరిపడును?

శ్రీ వైష్ణవమతమున, 1 పరము 2 వ్యూహము 3 విభవము 4 అర్చావతారము 5 అన్తర్యామిత్వము అను ఐదు భేదములు శ్రీ విష్ణు మూర్తికి గలవు.

ఏలనన, మాగురుదేవుడు దేశకాలాపరిచ్ఛిన్నుడై యుండువాడు. అదిన్నిగాక గురుపదము నొందినవారికి మరల పునరావృత్తి లేదు. శ్రీ వైకుంఠమున శ్రీ విష్ణు భగవానుడుండు వఱకు వైకుంఠవాసులుండి విష్ణుభగవానుని కాలావధి పూర్తియగునపుడు పునర్జన్మము నొందుదురు. లేక శ్రీ విష్ణు భగవానునివల్ల బ్రహ్మోపదేశము నొంది గొందురు. యచ్చోటనుంచియు ముక్తులు గాగలరని యొక యర్థము గూడ శ్రుతి జెప్పుచున్నది. అయితే అధిక సిద్ధాన్తము పునర్జన్మనెత్తి మఱల బ్రహ్మ

విచారము చేసికొని ముక్తులగుదురనియే, పునర్జన్మము వచ్చినను, శ్రేష్ఠమగు జన్మమేగలుగును. బ్రహ్మ లోకమును పొందినవారు గూడ యే లాగున విశిష్టజన్మము గలవారై మోక్షమునకు తగిన దైవగుణము గలవారై జన్మింతురో, వీరుగూడ ఆలాగున అప్రాకృతదివ్యగుణము గలవారుగనే జన్మింతురు. విష్ణుదేవుని స్థానమునకు కాలావధి యుండుట చేతనే బ్రహ్మప్రళయమనియు, విష్ణుప్రళయమనియు, శాస్త్రముల ద్వారావినుచున్నాము. కాలపరిమితిగూడ శాస్త్రమే నిర్ణయించియున్నది. ఇందువల్ల మాగురుపదమువలె యీవైకుంఠ పదము శాశ్వతము కానందుచే మాదేశికేంద్రునితో సమానదృష్టాంత మెట్లు చెప్పవచ్చును. కావున యిచ్చటగూడ ఎట్లు యాలోచించినను మానముతప్ప మఱేమి యుగోచరించుటలేదు. అదియునుంగాక శ్రీ రామావతారమున వసిష్ఠ మునివల్లను, శ్రీ కృష్ణ వతారమున సాందీపుని వల్లను, గురూపదేశము బొందియున్నారు. కావునస్వయముగా గురుత్వము యీవిష్ణుమూర్తికి గూడలేదు యీసత్యమును గూడ గీ. 4 వ అధ్యాయమున, శ్రీభగవానుడు స్వయముగానే యుపదేశించెను.

శ్లో॥ తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.

తా॥ తత్త్వవేత్తలైన యాత్మజ్ఞానులు నీకొఱకు జ్ఞానమును పదేశింపగలరు. ఓ అర్జునా? అట్టి జ్ఞానమెట్లు గల్గుననిన వినయముతో జేయునమస్కారముచేతను, సమయమును కనిపెట్టి యడుగుట చేతను, గురువాజ్ఞను పాలించెడు గురుసేవచేతను, వారుచెప్పగలరు. దీనికన్న ప్రబల ప్రమాణమికయేమి కావలయును. మఱియు రజోగుణముతో గూడినవాడు చతుర్ముఖబ్రహ్మయనియు, సత్త్వగుణముతో గూడిన వాడు శ్రీ విష్ణుభగవానుడనియు, శాస్త్రముద్ఘోషించుచున్నది. గీత. 14 వ అధ్యాయమున యీవిషయము విస్తారముగా చెప్పబడియున్నది. మోక్షమో యీమూడు గుణముల కతీతమగు విశుద్ధసత్త్వమందు మాత్రమేగలదనియు, ఆ అధ్యాయమున శ్రీ భగవానుడే యుపదేశించి యున్నాడు. ఆ అధ్యాయమంతయు ఇరువది ఏడు శ్లోకములున్న యీ

త్రిగుణముల, త్రిగుణాతీతమునే తెలుపుచున్నవి. దీనికన్న ప్రబలమగు ప్రమాణమును మరొకటిగావలయునని తలంచుటలేదు.

5 శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః.
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్.

తా॥ మాయవలన గలిగిన సత్త్వము రజస్సు తమస్సు అనునట్టి మూడుగుణములు. యీ గుణముల కంటె వేరైన నాశరహితుడైన ఆత్మను ఆగుణములు యీ దేహమునందు బంధించుచున్నవి. కావుననే యీ త్రిమూర్తులకు భార్యలుండుటకు గారణమైనది. తరువాత యీ అధ్యాయాంతమున మూడుగుణముల నుండివిడుదల బొంది మోక్షమును పొందెడు విషయముగూడ దెలుపడ మైనది.

శ్లో॥ 20, గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుః ఖైర్విముక్తోఽమృతమశ్నుతే.

తా॥ జీవుడు దేహోత్పత్తికి కారణ భూతములైన పైన చెప్పబడిన సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించి అనగా దేహమును విడనాడక మునుపే బ్రహ్మజ్ఞానముచేత త్రిగుణములు నణచి పుట్టుక చావు ముసలి తనము దుఃఖములు మొదలగు వానిని చెందక అమృతత్వము నొందు చున్నాడు. అయితే యీత్రిమూర్తులసేవ అనగా భక్తి వ్యర్థముగాదు. మూడుగుణములతోగల బంధములనన్నిటిని మూడుగుణములకావల పొందుటకుగల ఆటంకములనన్నిటిని నాశము నొనర్చగలదు. అంతేగాక మూడుగుణముల కావలనుండు పరబ్రహ్మమును పొందుటకు యే యాచార్యునిసహాయము గావలయునో,అదియును సమకూర్చగలదు. అందువలన భగవద్భక్తులకు బంధవిముక్తి గలుగుననియు; మోక్షములభించుననియు చెప్పెడు రహస్యము. ఏమి, ఇదిసామాన్య విషయమా! దీనికంటె పరమోపకారము జీవ కోట్లకు మరేమి కావయులను? భవసాగరము దాటునట్టి యుపాయములన్నిటిని పరమభక్తులకు త్రిమూర్తులుపదేశించ గలరు. గావుననే భగవంతుడు సంసార సాగరమును దాటించువాడని చెప్పుటకు కారణము. యీ విషయమై వేలకొలది ప్రమాణములుగలవు. ఇదిమికిలి సంగ్రహ గ్రంథమగుటచే అవియన్నియు చెప్పిన గ్రంథము

పెరిగిపోవునని తలంచిచేర్చం బూనలేదు. ఆ సత్యము గీ, అ, 10 లో చెప్పఁబడినదిచూడుఁడు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే.

తా॥ ఎల్లప్పుడు భగవంతుఁడనగు నాయందేకాగ్రచిత్తులును ప్రీతి పూర్వకముగా నన్ను భజించు వారునునైన నిరంతర ధ్యానపరులకు పరబ్రహ్మ స్వరూపమును పొందుటకు సాధనమగు యే జ్ఞానము గలుగ వలయునో, అట్టిదానిని గలిగించుచున్నాను. ఈ శ్లోకమునందు పైన నిరూపించుచూ వచ్చిన దానియొక్క సారము శ్రీ భగవానునిచే తెలుపబడెను. "దదామి బుద్ధి యోగం తం యేన మాముపయాన్తి తే" బ్రహ్మపదమును పొందుటకు యెటువంటి ఏకాగ్రత విశుద్ధతగల బుద్ధి గావలయునో అట్టి బుద్ధిని నేను గలుగ జేయుచున్నాను. అదియే పరమార్థము.

శ్లో॥ తేషామేవానుకంపార్థమహ మజ్ఞానజం తమః
నాశయామ్యాత్మ భావస్థో జ్ఞాన దీపేన భాస్వతా.

తా॥ ఎల్లప్పుడును ధ్యానముచేయు భక్తులను అనుగ్రహించుట కొఱకు వారి అంతఃకరణ మందున్నవాఁడనై వారియొక్క అజ్ఞాన జన్య మైన మోహాంధ కారమున వెలుగుచున్న జ్ఞానమనెడు దీపముచేత పోగొట్టుచున్నాను. ఇదియే భగవానునియొక్క కరుణారస విశేషము. భక్తులయందుగల అమితవాత్సల్యము. చీకటిగదిలో కావలసిన వస్తువు నెతుకొనుటకు తడుము చున్నటువంటివానికి ఒకరుదీపమునుదెచ్చి వస్తువు కనుపింపజేయు ధర్మమెటువంటిదో భగవద్భక్తివలన గలుగుఫలమున్ను యిటువంటిదే. గీ. అ. 12. శ్లో 7.

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥

తా॥ భగవంతునియందు సమర్పింపబడిన మనస్సుగల వారలను త్వరలోనే జనన మరణరూపమగు సంసారసాగరమునుండి ఆ భగవంతుడే యుద్ధరించునని ప్రమాణపూర్వకముగా తెలుపడ మాయెను. సముద్ర

ముగా పడినవానిని సముద్రతీరమున జేర్చునట్లు భక్తులను భవసాగరము నుండి దాటించును. ఇచ్చటగూడ సముద్రతీరమును చేర్చుటకు నావికవలె బ్రహ్మపదవిని నొందించుటకు భగవంతుడు సర్వవిధములుగ సహాయపడును. దీనికంటె భక్తులకు మరేమికావలయును?

త్రిగుణముల కతీతమే బ్రహ్మపదవియనియు ఆ బ్రహ్మపదమే సాక్షాద్విష్ణుపదమనియు, అదే శ్రీ కృష్ణపరమాత్మయొక్క నిజస్వరూపమనియు, మాయాకల్పితమగు వైకుంఠ పదముగాదనియు స్వయముగా శ్రీ కృష్ణభగవాను లుపదేశించడమైనది. గీ. అ. 7. శ్లో॥ 24.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరం భావమజానంతో మమావ్యయ మను త్తమమ్॥

తా॥ మందబుద్ధులు నాశములేనిదియు, ఉత్తమోత్తమ మైనదియు, ప్రకృతికంటె విలక్షణమైనదియు, నాస్వరూపమును తెలియనివారగుచు వ్యక్తుడుగాని చక్షురాదీంద్రియములకు గోచరించని నన్ను గోచరత్వమును పొందినవానినిగా తలచు చున్నారు దీనియందు "అబుద్ధయః పరంభావమజానన్తః మమావ్యయమను త్తమమ్" యీపదములయర్థములను బాగుగవిచారణచేసికొనినబ్రహ్మపద మెటువంటిదో మందమతులు సహా తెలుసుకొన గలరు. అబుద్ధయః = బ్రహ్మవిచారమునకు తగిన బుద్ధియోగ్యత లేనివారు. పరంభావమజానన్తః = ప్రకృతి పరమగు బ్రహ్మపదము దెలియనివారు. మమావ్యయమను త్తమమ్ = నాశములేనిదియు యుత్తమోత్తమమైనదియు నగు నాపదమును,

ఈ క్రింది శ్లోకముచే ఎందువల్ల ఆ బ్రహ్మపదము జీవులు తెలిసికొనక పోవుచున్నారో ఆకారణము యిచ్చట తెలుపబడుచున్నది. గీ. 25

శ్లో॥ నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజమవ్యయమ్॥

తా॥ నేను యోగమాయచే గప్పబడినవాడనై సమస్తజనమునకు గోచరించు వాడనుకాను. వివేకములేని ఈ జనము జన్మరహితుడైనట్టియు నాశరహితుడైనట్టియు నన్ను ఎఱుగజాలరు. ఇప్పుడు నేను శ్రీ విష్ణుభగవానుని గూర్చిచెప్పవలసిన విషయములలో ముఖ్యమగు విషయమును తెలిపితిని. ఇచట గురువుయొక్క స్వభావమునుగురించియు

శిష్యునియొక్క ధర్మమును గుఱించియు తెలుపబడి యున్నది. కావున స్వయంప్రకాశ గురుస్వరూపుడై యుండు మా గురుదేవునికిన్ని పరమ గురువువల్ల నియుక్తుడగు శ్రీ విష్ణుమూర్తికిన్ని యే విధమైన సాదృశ్యము గలుగును? యీ విషయమై సనకాది మహర్షుల గాథయొకటి గలదు. అవి యిదివరలో చతుర్ముఖ బ్రహ్మను గుఱించి చెప్పినప్పుడా సనకాది మహాయోగులు యేలాగున బ్రహ్మలోకమునుండి తిరిగివచ్చిరో ఆ లాగున శ్రీ వైకుంఠలోకమునకు వెళ్లినపుడుగూడ అదేరీతిగా జరిగెను. అదిఏలాగన, సనకాది మహాయోగులు బ్రహ్మలోకమున సంశయ నివృత్తిగానందుచే, తిరుగ శ్రీ వైకుంఠమునకెళ్లి శ్రీమన్నారాయణ మూర్తికి సాష్టాంగనమస్కార మొనర్చి, అంజలిబద్ధులైనిలిచియుండగా కుశలప్రశ్నలడిగి యుచితాసనముల గూర్చుండబెట్టి, ఆ పరమఋషులపై యెంతయో ప్రీతియు, యాదరణ గలవాడునై యుండి ఆ గమన కారణ మేమనియడుగగా ఆ ఋషివర్యులు తమకు జీవేశ్వరుల ఐక్యవిషయమై సందేహము గలిగెననియు, బ్రహ్మ లోకమునకెళ్ళి బ్రహ్మతో మనవి జేయగా చాలా వేదవేదాంతముల నుపదేశించినను మనస్సు తృప్తి జెందకుంటున్నదనియు, ఇక దేవరవారుతప్ప యీ సందేహనివృత్తిజేయు వారు మూడు లోకములో మరెవ్వరున్ను లేరనియు, కావున సంశయ నివృత్తిజేసి మమ్ములను కృతార్థులనుగా గావింతురనియు తెలుపుతు నలుగురు మునిసత్తములులేచి మఱొకమారు దండ ప్రణామ మొనర్చినది జూచి, శ్రీ భగవానుడు స్వయముగాలేచి మునుల హస్తముల పట్టుకొని గూర్చుండజేసెను. యోగివర్యులును భగవదాజ్ఞను సారముగా వారి వారి యాసనములలో సర్వేంద్రియ నిగ్రహముగలవారై నిశ్చలముగా సిద్ధాసనాసీనులైరి. అప్పుడు శ్రీ భగవానుడు వేదవేదాంత రహస్యము లెన్నిటినో గొప్ప గంభీర భావముతో యెక్కువసేపు బోధించుచూ, అయితే, యీ జ్ఞానదీపమునకు తీవ్రవైరాగ్యము దృఢముగా మొట్టమొదట యుండవలయుననియు, అది ప్రమిదవంటిదనియు, అనన్యమైనభక్తి, తైలము వంటిదనియు, సర్వేంద్రియ నిగ్రహము వత్తి వంటిదనియు, తగినస్థలములో మాత్రమేనివాసము చేయుట గాలిలేని ప్రదేశము వంటిదనియు, ఇవి యన్నియు గలిగిన మాత్రముననే జ్ఞానజ్యోతి యంత

రాయము లేక వెలుగుచుండు ననియు అగాధార్థములతో గూడిన దీర్ఘ
మగు గంభీరోపన్యాసము చేయగా శ్రీ భగవానునికిగూడ బ్రహ్మదేవు
నికి గలిగినట్లు జెమట గలిగి జలము ధార ధారగా గారుటను చూచి
శ్రీ లక్ష్మీదేవి వెంటనే పరుగిడివచ్చి వింజామరలతో విసరుచు సేవ
జేయుటజూచి ఊర్ధ్వరేతస్కులగు మునిపుంగవులు ఒకరినొకరుముఖము
జూచుకొనుచు తలలుకొంచము వంచుకొని జిఱునవ్వునవ్విరి. అత్తరి భగ
వానుడు యీ ఋషుల యాశయము నెఱింగి కొంత తడవు మౌనమును
వహించి యీ మునిసత్తములకు విశ్వాసము గలగలేదని తలంచి తనలో
తాను ఆలోచించు కొనుచుండగా, యోగిపుంగవులు నల్వురును చెప్పే
లాగున చేయనివారి వాక్యములకు విలువలేదని తలంచి వీరున్ను కొంత
తడవు మౌనముగానుండి తమలో తాము యికయేమి చేయవలయునని
యుండుస్థితిని భగవానుడెఱింగి, యిక వీరికి చెప్పిన ప్రయోజనము లేదని
గ్రహించి మునివర్యులారా! ఇచటి పరిస్థితు లన్నిటిని మీ రెఱింగి
యున్నారుగదా! ఇక మరొక గురువు నాశ్రయించుకొనుడు. మీకు యెల్ల
ప్పుడు శ్రేయస్సు గలుగుగాక! యని మంగళాశీర్వాదముచేసి మౌన
ముద్రను ధరించియుండు, శ్రీ భగవానునిజూచి ఋషులులేచి నమస్కా
రముచేసి ప్రయాణమునకు సెలవడుగ విష్ణుభగవానుడు ఋషివర్యు
లారా! శ్రీ కైలాసగిరియందు శంకరుడున్నాడు. ఆయనగొప్ప వైరా
గ్యము గలవాడు. వారి దర్శనమువల్ల మీరు కృతార్థులు గాగలరని
తలంచుచున్నాను. బ్రహ్మవిద్య ప్రకృతిపదమున్ను ప్రకృతిరహితమున్ను
అగుటవలన యిది తీవ్రవైరాగ్యము గలవారికే లభ్యమగునని చెప్పుచు

శ్లో॥ వైరాగ్యతైల సంపూర్ణే భక్తివర్తి సమన్వితే
ప్రబోధపూర్ణపాత్రే తు జ్ఞప్తిదీపం విలోకయేత్॥

అని యీ యుపనిషత్తు శ్లోకమును పఠించి ప్రసన్నుడై మౌనముగా
యుండెను. దీని అర్థము పై జెప్పినదే, అత్తరి ఋషులు తమ వ్యాఘ్రాసన
ములను యోగదండములను కమండలములను యెత్తుకొని కైలాసము
నకు బయలుదేరిరి. ఈ కథను గ్రహించుకొనిన యిప్పుడురాజయోగులని
చెప్పు కొందఱి గురువులయొక్క స్థితిగ్రహించు కొనవచ్చును, కావుననే
శాస్త్రములో యీ లాగుచెప్పుటకు కారణము.

శ్లో॥ పరోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణామ్
తదనుష్ఠానవిషయే కస్యచిద్ది మహాత్మనః.

తా॥ పరులకు బోధించు విషయములో మహాసులభముగానుండును అప్పుడందరును పండితులే, తాను చెప్పులాగున నడచువిషయములో ఒకానొక మహాత్ముడు మాత్రమే కనుపించును.

విష్ణుదేవునిచే పూజనొందిన ఋషిసత్తములు "సంశయాత్మా వినశ్యతి" అను ప్రమాణము ననుసరించి సంశయము గలవారు నశింతురు గదా! యనితలంచి శ్రీ పరమశివుని నిలయమగు శ్రీ కైలాస మునకు ప్రయాణమైరి. యీకారణము వల్లను సంపూర్ణ విరక్తుడును, అఖండ బ్రహ్మచారియు నగు మాగురుదేవునితో శ్రీవిష్ణుభగవానుని యెట్లసమానముగాజేసి వర్ణనజేయగలను? అదిన్నిగాక పురాణములో కొన్నిస్థలములలో విష్ణుయొక్క భక్తుడే శివుడనియు, శివునియొక్క ముఖ్య భక్తుడే విష్ణువనియు గలదు. అట్టి ప్రమాణములన్నియు, యిచట వ్రాయంబూనలేదు. శివపురాణ విష్ణుపురాణ ఆత్మపురాణాది గ్రంథము లలో చూచుకొనవచ్చును. ఏలనన అది మతద్వేషమునకు కారణమై సోదరభావమును ప్రేమయును ధ్వంసమొనర్చు నటువంటిదిగా నున్నది. కావుననే గురుధ్యానములో మొట్టమొదట బ్రహ్మను, తరువాతవిష్ణువును చెప్పుటకు కారణము. మూడవది ఈశ్వరునిగూడ చెప్పి పిమ్మట పర బ్రహ్మముగా గురుదేవుని వర్ణించుటకు కారణమైనది. యథార్థముగా యీముగ్గురు మూర్తులను మూడుగుణములుగా వర్ణించడమైనది. కాని ముగ్గురు దేవతలున్నారాయను అర్థముగాదు. మఱియు సృష్టి స్థితి లయ ములు లోకములో కనుపించుటవల్ల అట్లువర్ణించడమైనది. నిజముగా యీసృష్టి స్థితి లయములన్నియు,ఒకేపరమాత్మ శక్తివల్ల జరుగుచున్నవి.

శ్రీవిష్ణుభగవానుని గురించి వర్ణించునపుడు బ్రహ్మరూపముగా సృష్టిచేయునదిన్ని, విష్ణురూపముగా పాలనముచేయునదియు, శివరూ పములయ మొనర్చునదియు,నీవొకడవేయనిస్తోత్రముచేయుటకుకారణము. అలాగున శివునిగురించి స్తుతించినపుడు బ్రహ్మత్వేనసృష్టియు విష్ణుత్వేన పాలనమున్ను శివత్వేనలయమున్ను నీవొక్కనివల్లనే జరుగుచున్నదని స్తోత్రముచేయుటకుకారణము. దీనికిసంబంధించిన ప్రమాణములెన్నియో

గలవు. అవి యన్నియు పైనుదహరించిన గ్రంథములలో చూచుకొన వచ్చును. ఇందువల్లనే యుపనిషత్తులలో అకారము రజోగుణ బ్రహ్మ యనియు, ఉకారము సత్వగుణవిష్ణువనియు, మకారము తమోగుణశివుడనియు వర్ణించి, గుణత్రయాతీతమగు పరబ్రహ్మము అర్ధమాత్రయనియు, దానినే బ్రహ్మప్రాప్తికొఱకు బ్రహ్మనిష్ఠులుపాసించవలెనదనియు తెలుపుటకు కారణము. "ఉపాస్యంప్రణవస్యాగ్రం" అని తెలుపుటకు కారణమైనది ఇట్టి కారణమువల్ల గుణత్రయాతీతుడును పరమాత్మస్వరూపుడును నగు మాగురుదేవుని గుణములతోకూడిన దేవతలను చేర్చి యెట్లుస్తోత్రముచేయగలను? కావున నేను గురుస్తోత్రముచేసి యుపన్యాసముచేయజాలకపోయితినని, గద్గదస్వరముతో చెప్పుచు, ఆనందబాష్పములతో పులకితాంగుడై మౌనియై రెండునేత్రములున్ను లెస్సగ తెఱవబడినవాడై నిశ్చలుడై నిలిచెను. అప్పుడు మహాజనులతో నిండి యుండు సర్వ స్త్రీ పురుషులున్ను కొలిమిలో పెట్టిన నానావిధలోహ ఖండములన్నియు అగ్నిమయమై వెలుగుచున్నట్లు ఆ పరమభక్తుని ధ్యానములో తన్మయులై ఒకే కంఠముతో ఓ మహాత్మా? మేముజన్మమెత్తిన తరువాత యెందరోయోగులయొక్క యోగాసనములను ప్రాణాయామములను ధౌతి నేతియను, మొదలగు షట్క్రియలను ధారణాధ్యాన సమాధులను యెన్నిమారులుచూచితిమి. యిప్పుడుగలిగినట్టి యీమహదానందమును మేమెప్పుడనుభవించి యుండలేదు. యిట్టి మహాభాగ్యము గలుగుటకు మేము పూర్వజన్మములో యేమిపుణ్యముజేసితిమో! మాతల్లిదండ్రులేనోములునోచిరో ! మాతల్లిదండ్రులే తపస్సుచేసిరో! చెప్పజాలము! ఇట్లు గద్గదస్వరములతో చెప్పుచు గురుస్తోత్రము చేయ ప్రారంభించిరి.

శ్లో॥ సముద్రే వై యథా తోయం క్షీరేక్షీరం జలే జలమ్
భిన్నే కుంభే యథాకాశం తథాత్మా పరమాత్మని.

తా॥ యేలాగున సముద్రములో నదుల జలమున్ను, పాలలో పాలున్ను, నేటిలో నీరున్ను ఘటము ధ్వంసమైనపిమ్మట, ఆకాశములో ఆకాశమున్ను, అభేదమగునో, అదేప్రకారము పరమాత్మయందాత్మయు ఐక్యమగును.

శ్లో॥ "తథైవ జ్ఞానవాన్ జీవః పరమాత్మని సర్వదా
ఐక్యేనరమతే జ్ఞానీ యత్ర కుత్ర దివానిశమ్".

తా॥ పై చెప్పినప్రకారము, జ్ఞానోదయముగల జీవుడు, పరమాత్మ యందు, యెల్లప్పుడున్ను, అద్వైతప్రకారమగుచున్నాడు. జ్ఞాని అన్నిస్థలములలోను, రేయింబవళ్లును, పరమాత్మైక్యమువలన ఆత్మయందు రమించుచున్నాడు. యీప్రకారము స్తోత్రముజేసి, సూర్యోదయము చూచి చక్రవాకపక్షులు నిమీలిత నేత్రములుగలిగి నిశ్చలముగాయున్నట్లు, సభలో యుండు నరనారీ మణులందరు, వికసితనేత్రులై అమ్మహాను భావుని చూచుచు, ఓమ్ ఓమ్. ఓమ్. అని తిన్నగ ఉచ్చరించుచూ కూర్చుండిరి.

ఓమ్.

---

# 8. శివదృష్టాంతము.

తురీయ పదమందు, విశ్రాంతి పొందినమనస్సు గలవాడై, ప్రసన్నజ్ఞానముగలవాడై నిద్రనుంచి జాగ్రతావస్థవచ్చు వాని నేత్రాదీఇంద్రియములన్నియు, తెన్నగవికసితములై యున్నట్లు, క్రమముగ చక్కగ ప్రాణచలనము గలవాడై, ఆ పరమగురుభక్తుడు ఓమ్. ఓమ్. ఓమ్. అని ప్రణవము నుచ్చరించుచు మరలచెప్ప దొడంగెను. వర్షాకాలము బలపడునపుడు, కాలువలచే పూరితమై, విస్తృతమగునది వోలె, యీమహాత్ముని బోధలువినుటకు, పరిసరప్రదేశములనుండి అనేకమంది భక్తులు వచ్చి చేరుటచే, యిదివఱలో యుండినసభాస్థలము జనులకు కూరుచుండుటకు చాలకపోయెను. మఱల సభాపందిలిని కార్య నిర్వాహకులు చాల విస్తరింపజేసిరి. అత్తరి సభికులనుగూర్చి యిట్లుచెప్ప దొడంగెను. సనకాదిమునిసత్తములు నలువురున్ను, శ్రీకైలాసమునకు యాత్రకై వచ్చు విషయము శ్రీ పరమశివుండు తనదివ్యదృష్టిచే తెలిసి కొని, బ్రహ్మలోక, వైకుంఠ లోకములలో జరిగిన సంగతులన్నియు నెఱింగి కైలాసమున పార్వతీదేవితో గూడియుండినచో బ్రహ్మ విష్ణువులకు గలిగినట్లు పరాభవము తనకుగూడ గల్గునని తలంచియు, అంతే గాక యీసనకాదియోగివర్యులు, నివృత్తి మార్గస్థులగు మునులకు ఆచా

ర్యులైన, అత్రిమునీశ్వరుల సందేహమును బాపువారై యుండవలసిన వార
రగుటచేతను, ఇప్పుడు తనకుండు యీ రత్నమణిఖచితమగు కైలాస
మున భవానితోఁ గూడియుండుట తగదనితలంచి, సర్వమును త్యాగ
మొనర్చి, విభూతి రుద్రాక్షలను వ్యాఘ్రచర్మాసనమును ధరించి, ఒకవటవృక్ష
మునొక్క మూలమున దక్షిణాభిముఖుఁడై సిద్ధాసనాసీనుఁడై చలిం
చని బ్రహ్మదృష్టిగలవాఁడై, ప్రసన్నముఖారవిందుఁడై ప్రకృతిని తిరస్క
రించువానివలె గంభీరముగా అందరకు తోఁచునట్లు కూర్చుండెను. ఇదియే
దక్షిణామూర్తియొక్క యవతారరహస్యము. సర్వేంద్రియములను నిగ్ర
హించి, ప్రత్యక్చైతన్య బ్రహ్మస్వరూపమందు నిలకడ గలిగియుండు
నప్పటికిన్ని, సనకాదిమునివర్యులునలుర్వురున్ను, తీవ్రబ్రహ్మ జిజ్ఞాసగలవారై
వైరాగ్యనిధులై, వచ్చునప్పుడే యీదక్షిణామూర్తియొక్క స్థితిని జూచిన
వారై, తమకు సరియైనగురుఁడు దొరికెనని నిశ్చయించుకొని, హృద
యానంద భరితులై, శ్రీదక్షిణ మూర్తి భగవానునకు సాష్టాంగ
నమస్కారమొనర్చి నిశ్చలులై నిలిచియుండగా, శ్రీపరమేశ్వరావతారు
డగు శ్రీదక్షిణామూర్తి చిరునవ్వుతోఁ కాంతివంతమైన ముఖముగలవాఁడై
శిరస్సుచే ఋషులను కూర్చుండేలాగున సంజ్ఞచేయగా, ఆ నలుగురు
మునులున్ను సిద్ధాసనమునందు గంభీరభావముతోనే కూర్చుండిరి. అప్పటి
నుంచి తమకుగల జీవబ్రహ్మైక్య సందేహమునుగూర్చి యనేక వేల
సంవత్సములు ఋషులకున్ను, దక్షిణామూర్తికిన్ని ప్రశ్నోత్తరరూపముగా
సంవాదముజరిగెను. వేదమునుగూర్చియు, వేదాంతమగుయుపనిషల్లక్ష్య
మును గూర్చియు, ప్రసన్నభావముతోనే శాస్త్రార్థమును జరిపిరి. వారి
ప్రశ్నోత్తరము లన్నిటిలోను మొట్టమొదటిది, జీవేశ్వరులు భిన్నులా?
లేక, అభిన్నులా? అనువిషయము ముఖ్యమై యుండెను.

(1) జీవునియొక్క కించిజ్ఞత్వమున్ను, ఈశ్వరుని యొక్క సర్వజ్ఞత్వ
మున్ను, ఎట్లు యేకమగునను ప్రశ్నకు అవిరెండున్ను ఉపాధిగతములే
గాని, సత్యముగాదని, జహల్లక్షణ అజహల్లక్షణ జహదజహల్లక్షణా
వృత్తులవల్ల పరమ శివమూర్తియగు దక్షిణామూర్తి బోధపరచెను.

2. మఱియు క్షుత్పిపాసాది ద్వంద్వములతోను, జనన మరణాది
ద్వైతములచేతను, జరానరాది భేదములచేతను, మరియు యనేకక్లేశ

ములతో గూడిన యీ జీవుడు ప్రకృతి దోషములు లేని ఈశ్వరునితో యెట్లు ఏకత్వమున్ను, ఐక్యతయున్ను, సంభవించునని ఋషు లడుగగా క్షుత్పిపాసాదులు ప్రాణ ధర్మమనియు, జననమరణాదులున్ను, జరాన రాదులున్ను, శరీరసంబంధ ధర్మమనియు, వీటికిసాక్షియై యుండుయాత్మ కవి లేవనియు, ఉపదేశించెను. పాత్రలున్న పాత్రములోగల జలములున్ను వేఱువేరు విధములుగానుండినను, వానిలో ప్రతిబింబించిన సూర్యబింబ మునకు అవి యెట్లుండునో, అనిసమాధానమిచ్చిరి. బాల్యయౌవన వార్ధక్యా వసగూడ కాయమునకు సంబంధించినవేగాని, వాటికిసాక్షియగు ఆత్మసం బంధమునకు కావని నిరూపించిరి. ఆత్మ పాత్రములో ప్రతిబింబించనసూర్యు నివలె శుద్ధజ్ఞాన స్వరూపుడని నిర్ణయించి చెప్పిరి. ఆత్మ విచారముచేయ కయు, చిత్తైకాగ్రతయు, చిత్తనైర్మల్యము లేక పోవుటవల్లను సద్గురు సన్నిధిలో శమదమాది గుణముగలిగి వినయముతో గురుసేవచేసి వేదాన్త శ్రవణముచేయ నందుచేతను, ఇట్టిభ్రమగల్గుటకు కారణమని ఉద్ఘాటించిరి అవిద్య హృదయమునచేరిన దోషముచేత నీటియొక్క చలనము దాని యందు ప్రతిబింబించిన చంద్రుని యందారోపించినట్లు అజ్ఞులు యీకల్పన లన్నియు చేయుచుందురేగాని, విజ్ఞులకు యేలాటి సంశయమున్ను గలు గదు. అట్టి విజ్ఞాన హృదయులు ఆకాశమునయుండు చంద్రబింబము చలించనట్లు దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియై యుండు ఆత్మ స్వప్రకాశుడను జ్ఞానము గలవారై, ఆనందభరితులై యుందురని శ్రీదక్షి ణామూర్తియుపదేశించెను. పరమ వైరాగ్యముతో వెలుగుచుండు శ్రీదక్షిణామూర్తియొక్క ఉపనిషదర్థనిర్ణయ వాక్యములను గంభీరము గాయుపదేశించు దానిని విని సనకాదులు మిక్కిలిసంతుష్టాంతః కరణులై యన్ని ప్రశ్నలకును వచ్చెడి సమాధానములచే తృప్తి నొందుచుండిరి.

అట్టి దివ్యజ్ఞాన స్వరూపుడే తనయాత్మయైయుండగా ఏల జీవులది తెలిసికొనక దుఃఖితులై పోవుటకు కారణమని ఋషులు అడుగగా వైరాగ్యము గలిగి బ్రహ్మనిష్ఠయు శాస్త్ర జ్ఞానముగల సద్గురుమూర్తి సన్నిధానమున చక్కగ శ్రవణముచేయని దోషమేగాని మఱొకటిగాదని ముందుగానే తెలుపబడమైనదని దక్షిణామూర్తి యానతిచ్చెను. ఒకవేళ మననము జేయువారు కొందఱుండినను అట్టి వేలకొలది శ్రవణముచేయు

వారలలో మననము చేయువారు చాలకొలదిమంది మాత్రమేయుందురు. అట్టి మననముజేయు మునులలో నిదిధ్యాసనపరులు చాల తక్కువమంది మాత్రమే యేర్పడుదురు. అట్టి నిదిధ్యాసన నిష్ఠగల బ్రహ్మనిష్ఠులలో సంశయవిపర్యయాది దోషము సంపూర్ణముగా నశించువఱకును సాక్షాత్కార జ్ఞానము రూఢిగా కల్గువరకును చాలతక్కువ మంది మాత్రమే యేర్పడగలరని 'కఠవల్లి' శ్రుతియందు మీరు చూడలేదా? అని ప్రశాంత ప్రసన్న భావముతో శ్రీ దక్షిణామూర్తి తెలుపు పవిత్ర వాక్యములనువిని ఋషులునలుగురున్ను పరస్పర ముఖావలోకనముజేసి సరియైనగురువున్ను సరియైన బోధయున్ను లభించెను గదా! యని ప్రసన్న ముఖారవిందులై యుండిరి. అప్పుడు మునులు అట్టి యాత్మను తెలియనీయక జేయుశక్తి అవిద్యయయినచో అది విద్యారూపమగు జ్ఞానమున కన్యమైనదిగదా? అప్పుడు విద్యయు అవిద్యయు అని రెండు ఉండగా అద్వైత మెట్లు సిద్ధించునని ప్రశ్నించగా! శ్రీదక్షిణామూర్తి భగవానుడు యింద్రియముల నన్నిటిని మఱింత కేంద్రీకరించి ప్రచండ భాస్కరునివలె స్వరూపమందు ప్రకాశుడై నిలచుచు మహర్షిసత్తములారా! శిష్యుల బోధనార్థముగా అట్లు చెప్పుటయే శాస్త్రీయముగాని విద్యయు అవిద్యయు జ్ఞానము అజ్ఞానము అను యీలాగున రెండులేవు. యీసత్యము ఆత్మావబోధము గలుగువరకు యెవరికిని తెలియదు. ఆత్మోదయము గల్గునప్పుడు రెండవ వస్తువు మరియొకటిలేదని చెప్పెడియర్థము గోచరమగును. స్వప్నావసలో యుండువఱకు కనబడిన స్వప్నములన్నియు సత్యములుగా తోచినను జాగ్రతావస్థకు ఆత్మ వచ్చినప్పుడు స్వప్నావస్థలో గనుపించిన దంతయు మిథ్యయను జ్ఞానము గలుగుటలేదా! నీచగ్రహావిష్టుడగు బ్రాహ్మణుండు తన్ను ఆ నీచమునీశ్వరుడని తలంచినట్లు మీరెవరని అడుగు వారందరి తోను నేను మరాటీ మునీశ్వరుడనని చెప్పునట్లు అవిద్యాగ్రహ దోష ముండు వఱకు నిజరూపమును తెలియక అవిద్యా రూపముతోనే కూడి యుండును. మంత్రవేత్తయొక్క సహాయముచే గ్రహమును తొలగించి నపుడు నైజమగు బ్రాహ్మణత్వమేలాగున బోధపడునో ఆలాగున ఆత్మవేత్తయు కరుణామూర్తియగు గురువరుని యనుగ్రహమువల్ల అవిద్యాభూతము వదలిపోవునప్పుడు తనయొక్క బ్రహ్మత్వము గోచరముగా

గలుగును. కావుననే యీ విషయమై వివర్తవాదము నొక్క దానినే వేదాన్త మంగీకరించినది.

'అన్నపూర్ణోపనిషత్తు'నందు, ఋభుమహర్షి యీ వివర్తవాదమునే తనశిష్యుడగు నిదాఘమునికి ఉపదేశించెను. దీనిధర్మ మెటువంటిదన మంద ప్రకాశమున త్రాడునుజూచి సర్పమనిభయపడుటగలదు. సర్పము త్రికాలమందును త్రాటియందు లేదుగదా? అదేరీతిగా యాత్మయందు మూడుకాలములయందును అవిద్యలేదు. విచారణచేయని దోషముచే యున్నట్లు కనుపించుచున్నది. వాస్తవముగా విద్య, అవిద్యయను రెండు యుండిన ఎల్లప్పుడునుయుండవలసియుండునుగదా! అజ్ఞానశబ్దమున కర్థమే మన ఉన్నదానిని ఉన్నట్టు తెలియలేదను నదియే యగును. తెలియని దోషముతనదేగాని శాస్త్రమునదిగాదు అప్పుడు తెలియనివాని వాక్య ములను నమ్మవలయునా? లేక తెలిసినవారివాక్యములను నమ్మవల యునా? అని మీరే యోచించుకొనవచ్చును. తెలిసినజ్ఞానులు అవిద్య యనునది గల్పితమాత్రమేగాని వాస్తవముగా లేదనిచెప్పిరి. విద్యయొకటియే (జ్ఞానమొకటియే) కలదనిచెప్పిరి. కావున తెలియనివారి వాక్యమును మనము నమ్మవలసియున్నదా? లేక తెలిసినవారివాక్యమును విశ్వసించ వలయునా? అనిమీరే యాలోచించుకొనవలసినదని బోధించు శ్రీదక్షి ణామూర్తిభగవానుని వాక్యమునువినునపుడు యోగులగుసనకాదులు తెలిసినవారివాక్యమే సత్యమనినమ్ముదురేకాని, తెలియనివారి వాక్య మును ఎవరునునమ్మజాలరని అంగీకారమును తెలిపిరి. ఎటుకనశించ వలయుననియు, ఎటుకయుండువఱకు పరిపూర్ణముకాలేదనియు పరిపూ ర్ణమునునెఱింగిన ఎటుకస్వయముగానే లేకపోవుననియు కొందఱుతలంచు చున్నారు. ఎటుకనిశించినచో మరల వారుశిష్యులకు అచలమును నెఱుకజేయజాలరుగదా? అలాటివారిని లోకములో ఎచ్చటనైనచూచి యున్నారా? ఇదిరెటువంటిదనగా నోరులేకనే నేనుమాటలాడుచు న్నానాయనిచెప్పినట్లుంటున్నది. ఇదిపామరుల మాటలేగాక మఱియేమని చెప్పవచ్చును. ఒకవేళకొందఱికి తీవ్రధ్యానమువలననో చిత్తనిరోధము వలననో ఇంద్రియజ్ఞానము స్తంభించిపోవచ్చును. అప్పుడుశబ్దాది యేదృశ్యవృత్తులుగాని, మానసికాది యే సంకల్పములుగానియుండవు.

తరువాతవారే అట్టిస్థితినుండి మార్పుగల్గునప్పుడు వ్యుత్థానదశలోనికివచ్చుచున్నారు. ఇన్ద్రియనిరోదముగాని, మనస్సుగాని, చిత్తముగాని, బుద్ధిగాని చలించనిస్థితిగాని గలిగినను అవియన్నియు స్థూలదేహ సూక్ష్మదేహముల ధర్మములేగాని ఆత్మధర్మముగాదు. ఆత్మయెల్లప్పుడును స్వప్రకాశజ్ఞానస్వరూపమే, అది తానై నిలుచుటయే నిజమగుజ్ఞానము కైవల్యము అదియే, పతంజలిముని జెప్పినదానిని జూడుడు "తదా ద్రష్టుస్స్వరూపావస్థానమ్" దీనియర్థము పై జెప్పినదే. ఇట్టియోగశాస్త్రమున్ను ఉపనిషత్పరనమున్ను లేక కేవలము యోగశాస్త్రపరనమువలననే యిట్టినిజార్థమును తెలియని స్థితిలో పడిపోవుటకు కారణమగుచున్నది యీలాగున వేలకొలది సంవత్సరములు ప్రశ్నోత్తరసంవాదముతోనే కాలముగడచిపోయెను. అదియంతయు వ్రాయుటకెవరికిసాధ్యము. కావున సంగ్రహముగా యిచట తెలుపడమైనది. కావున పుష్పదంతుడను పేరుగల గంధర్వరాజు మహిమ్నాస్తోత్రమునందిట్లు తెలుపుటకు కారణమైనది.

శ్లో॥ అసితగిరిసమం స్యాత్కజ్జలంసింధుపాత్రే
సురతరువరశాఖా లేఖనీపత్రముర్వీ
లిఖతి యది గృహీత్వా శారదాసార్వకాలం
తదపి తవగుణానామీశ పారం నయాతి.

తా॥ నీలగిరి పర్వతసమానముగా సిరాపొడియు, సముద్రమే అది కలుపుటకు బుడ్డియు, దేవతరుశాఖలే కరములుగాను. యీపృథివియే (పత్రము) కాగితముగాను యేర్పఱచి శ్రీశారదాదేవి సర్వకాలసర్వావస్థలయందును యేమరపాటులేకవ్రాసినను, ఓ ఈశా! మీగుణములను వర్ణించుటకు సాధ్యముకాదు. అనగా బ్రహ్మమునుగురించి పూర్తిగా చెప్పుటకు ఎవరికిని సాధ్యముగాదనిభావము. "సురతరు" అనిచెప్పుటలో కల్పవృక్షము శాఖలను యెంత నఱికినను అంతకంతకు పెరుగుచుండును. అందువల్లనే సురతరుశాఖను కలముగావర్ణించుటకు కారణమైనది. అట్టి విషయములో మనుజుడు బ్రహ్మనుగూర్చివర్ణించుట కెంతమాత్రుడు. పైజెప్పినప్రకారము శ్రీదక్షిణామూర్తికిని సనకాదిమునులకున్ను బహుకాలమువఱకు ప్రశ్నోత్తరరూపముగా సంవాదముజరిగెను. చెప్పిచెప్పి కట్టకడకు శ్రీదక్షిణామూర్తి మౌనముగానుండి అంగుష్ఠతర్జని వ్రేళ్ల

సంయోగముచే జ్ఞానముద్రనుజూపి తననిజస్వరూపమగు సత్యజ్ఞానానంద నిత్యపదవిలోయుండెను. సనకాదులున్ను కృతకృత్యులై సర్వసంశయ రహితులై గురుస్తోత్రముచేసి తమతమ నివాసస్థానములకు వేంచేసిరి. ఓమ్.

అట్టి కాలమున శ్రీ పరమశివునకున్ను సనకాది యోగిపుంగవుల కున్ను భిక్షనొసంగుటకు శ్రీ పార్వతీదేవి అన్నపూర్ణాదేవి అవతారమును గైకొనెను. ఇదే శ్రీ దక్షిణామూర్తి యొక్కయు అన్నపూర్ణాదేవి యొక్కయు యవతార రహస్యము. ఓమ్.

శ్లో॥ ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయేనమః.

తా॥ తానొక్కండయ్యు ఈశ్వరుడు గురువు ఆత్మ యని మూర్తి భేదముచే విభాగమును జెందినవాడును, ఆకాశమువలె వ్యాపన స్వరూపుడును నగు శ్రీదక్షిణామూర్తి కొఱకు నమస్కారము.

శ్లో॥ ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే.
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః.

తా॥ ప్రణవార్థ స్వరూపుడును, శుద్ధజ్ఞానైకమూర్తియు, నిర్మలుడును ప్రశాంతుడును, ప్రకృతిదోషముల శమించినవాడును, అగు శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము.

ఈలాగున పరమశివమూర్తియగు శ్రీ దక్షిణామూర్తిని సనకాది ఋషులు స్తుతించి తమ సత్యలోకమున కేగిరి.

ఇత్తరి మాత్రము గురుభక్తి గల ఆ పరమభక్తుడు మునుపటివలె యేలాటి మార్పును గలుగక, నిత్యమై, నిరావరణమై, స్వప్రకాశమై, జ్ఞానమయమైయుండు తనస్వరూప స్థితిలోనే యుండెను. రెండురాళ్లను తీవ్రముగారుద్దుచుండిన రెండున్ను అఱిగిఅఱిగి యేమియు మిగులకుండ పోవునట్లు గురుభక్తుడు జీవేశ్వరుల ఐక్యాను సంధానము తీవ్రముగా చేయుచు వచ్చినందుచే ఉపాధిద్వయములు నశించి నిర్మలమైన ఆకాశ మువలె ప్రజ్ఞానఘన మనస్సు గలవాడై యుండెను. ఆదినము మహా సముద్రమువలె విస్తృతమైయుండు సభికులందరును యిదివరలో యుండు లాగునగాక, యింద్రియముల కేలాటి మార్పును గలుగనీయక అలలు శాంతించిన మహాసముద్రమువలె ప్రజ్ఞాన స్వరూపులై మందస్మిత

ముఖారవిందులై నిరతిశయానంద పరవశులై యుండిరి. బీజము బీజములోపులనుండి అంకురించినవృక్షము పెరిగి రాగారాగా బీజభావమంతయు, వృక్షాకారమై మారునట్లు గురుధ్యానము చేసి చేసి పరమభక్తుడున్ను బ్రహ్మాకార స్వరూపమగు గురుస్వరూపుడై మారిపోయెను. ఓమ్.

మరుదినమున గురుబోధ విని నిశ్శేషాజ్ఞాన రహితులై పరమానంద భరితులై జనులందరు చేరి మూడురోజులు సర్వ జనులకు అన్నదానమున్ను, వస్త్రములేనివారికి వస్త్రదానమున్ను చేసిరి. ఆవులు, యెద్దులు, గేదెలు, మొదలగు పశుసమూహములకు సహా మూడు రోజులును గొప్పగోసమారాధన జేసిరి. ప్రత్యేకముకొందరు భక్తులేర్పడి కుక్కలకు సహా వెతకి వెతకి తృప్తిగాభోజనము పెట్టిరి. మరొకభక్త సంఘమేర్పడి మహాసమరాధనలోవచ్చి గురుప్రసాదము భోజనముచేయుటకు వచ్చు అనుకూలము లేని బీదపురుషోస్త్రీలకు గ్రామగ్రామము ఇల్లిల్లు వెదకి వస్త్రములున్ను, భోజనసామగ్రిన్ని యిచ్చుచుండిరి. పవిత్రపూజా విధానముగల సర్వదేవాళయములలో అభిషేకార్చన పూజానైవేద్య ఉత్సవాదులు యీమూడురోజులున్ను గొప్పగా జరిపిరి. ఋషులందరు తతస్థానములలోనుండి దివ్యదృష్టిచే యివన్నియు చూచుచు దివ్యకర్ణములచే వినుచూ పరమానంద భరితులై యుండిరి. సర్వేశ్వరుండు భక్తులయొక్క ఆనందమును పుణ్యాత్ములయొక్క ధాన ధర్మములను ఋషులయొక్క అనంతానందమును చూచియు, పరమ సంతోష భరితుడై యుండెను. ఓమ్

---

# 9. గురు తత్త్వము

ఉత్తమజిజ్ఞాసువున్ను తీవ్రముముక్షువున్ను సంపూర్ణ వైరాగ్యమున్నగల ఆగురుభక్తుడు తాను ప్రారంభించిన గురుభక్తి ధర్మములను నిర్విఘ్నముగా పూర్తి చేసి కావలసిన శాంతులన్నియు విధిప్రకారము చేసి, పై దానిలో చెప్పిన ప్రకారము అన్నశాంతి మొదలగు హోమాదులు సలిపి, ఉపాధిద్వయరహితమగు బ్రహ్మాకార స్థితిలోనే సదా యుండెను. ఆభక్తాగ్రగణ్యుడు బోధించిన ధర్మోపన్యాసము లన్నియు

శాస్త్రసమ్మతముగానే యుంటున్నవని తెలుపుట కొఱకు యీ ప్రబంధ మిచట వ్రాయబడు చున్నది. ఓమ్.

శ్లో॥ శ్రుత్వా తత్త్వమసీత్యేవం బోధ్యమానోప్యనేకశః
న విజానాత్యయం తత్త్వమీశానుగ్రహవర్జితః.

తా॥ బహుకాలము తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణము చేసినను బహువిధములుగా దేశికేంద్రునిచే బోధింపబడినను యీశ్వరాను గ్రహములేని వానికి యీతత్త్వము బోధపడునదిగాదు.

శ్లో॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే.

తా॥ అవిద్యా కార్యరూపమగు ఉపాధితో గూడినవాడు జీవుడనియు, మాయా కారణ రూపమగు యుపాధి నిగ్రహించిన వాడు ఈశ్వరుడనియు, జీవునియొక్క కార్యోపాధియు, ఈశ్వరుని యొక్క కారణోపాధియును తొలగునపుడు పూర్ణబోధమగు జ్ఞాన మొకటియే మిగులును. ఇట్టి అవస్థనే ఆపరమభక్తుడు పొందెను

శ్లో॥ గురూపదిష్టమార్గేణ మనఃశుద్ధిను కారయేత్
అనిత్యం ఖండయేత్సర్వం యత్కించిదాత్మ గోచరమ్.

తా॥ గురూపదిష్ట మార్గముచేత మనస్సును లెస్సగాశుద్ధ పఱచవల యును. ఆత్మకన్యమయినయే ఒక్కవస్తువునుగూడ అనిత్యమనిఖండించ వలయును.

శ్లో॥ ఏవం విధం గురుం ధ్యాత్వా జ్ఞానముత్పద్యతే స్వయమ్
తదా గురూపదేశేన ముక్తోఽహమితి భావయేత్.

తా॥ పై జెప్పిన ప్రకారము గురుధ్యానము చేయుచు రాగా రాగా స్వయముగానే ఆత్మ జ్ఞానము ఉదయమగును. అట్టి గురుకరుణచే ఆత్మ జ్ఞానము గలుగునపుడు గురువు చెప్పిన ప్రకారము మహా వాక్యార్థము తెలిపెడు ఆత్మయే తానను భావన జేయవలయును.

శ్లో॥ స్ఫటికే స్ఫాటికంరూపం దర్పణే దర్పణో యథా
తథాఽఽత్మని చిదాకారమానందం సోఽహమిత్యుత.

తా॥ స్ఫటిక శిల పురోభాగమున మఱియొక్క స్ఫటిక శిలను నిల బెట్టినను దర్పణముయొక్క పూర్వభాగమున మరియొక అద్దమును నిల

## 9. గురుతత్త్వ

జెట్టినను యేలాగున రెండున్ను ఒకేనిర్మల యభేదావస్థను గలిగి యుండునో, ఆలాగున ఆత్మయందు చిదాకారానందమేదియో అదియే తనయొక్క స్థితియని నిశ్చయము. అనగా పరమాత్మ ఎట్లుస్వచ్ఛమైనదో జీవాత్మ ఆలాగుననే శుద్ధమగునప్పుడే ఐక్యముగలుగును. దర్పణసమ్ముఖ మున ఏయేవస్తువు లుండిన అవియన్నియు అద్దములో ప్రతిబింబించును. అద్దమువంటి మరియొక్క అద్దమును యెదుటిభాగమున పెట్టిన యేవిధముగా ప్రతిబింబభావముండదో, అట్టి యవస్థ గలిగి యుండుటయే దృశ్యరహితమగు ఆత్మసాక్షాత్కార జ్ఞానమని తెలియదగును. ఇదే నూనెలో నూనెయు, జలములో జలమైక్యమగునట్లు జీవేశ్వరుల ఏకత్వమని గ్రహించు కొనవలయును. తైలములో జలమున్ను, జలములో తైలమున్ను, యెట్లుఏకత్వము బొందజాలదో, ఆలాగున యీశ్వరత్వమెంతశుద్ధమో, యెంతజ్ఞానమో, జీవుడున్ను అట్టిశుద్ధియు జ్ఞానమున్ను, గలుగునపుడే ఐక్యము సిద్ధించును

శ్లో॥ మోహాదిరహితశ్శాంతో నిత్యతృప్తోనిరాశ్రయః
తృణీకృతబ్రహ్మవిష్ణువైభవః పరమోగురుః.

తా॥ మోహము మొదలైన యేదోషములు లేనివాడెవ్వడో, పరమశాంతిని పొందినవాడెవడో, ఎల్లప్పుడుతృప్తిని పొందినవాడెవడో, దేనిని యాశ్రయించనివాడెవడో, బ్రహ్మవిష్ణ్వాది వైభవములనుగూడ తృణీకరించినవాడెవడో అట్టివాడే పరమగురుండనబడును.

శ్లో॥ జలానాం సాగరోరాజా యథాభవతి పార్వతి
గురూణాం తత్ర సర్వేషాం రాజాఽయం పరమోగురుః.

తా॥ శివుడు పార్వతికిచెప్పినవాక్యము. ఓభవానీ ! జలములకన్నిటికి యేలాగున సముద్రుడురాజో, ఆలాగున గురువులందరకు యీపరమ గురుడు రాజు.

శ్లో॥ గురుర్దేవో గురుర్ధర్మో గురౌనిష్ఠాపరంతపః
గురోః పరతరంనాస్తి త్రివారం కథయామి తే

తా॥ గురువే దైవము, గురువేధర్మము, గురుదేవునియందుగల నిష్ఠయే పరమతపము, గురువుకంటెపరమైనదిలేదు. దీనిని ముమ్మారు, ఓ పార్వతీ!

నీకుచెప్పుచున్నాను = ఇక, గు, రు, అనుగల రెండుశబ్దములకర్థము నిరూపింపబడుచున్నది.

శ్లో॥ గుకారశ్చాంధకారో హి రుకారస్తేజ ఉచ్యతే
అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః.

తా॥ గుకారము అంధకారము, రుకారము దానిని గ్రమింగెడు తేజస్సు, అనబడును. అజ్ఞానమును గ్రమింగెడు బ్రహ్మమే గురువు. దీనియందు సంశయము లేదు.

శ్లో॥ గుకారశ్చాంధకారస్తు రుకార స్తన్నిరోధకృత్
అంధకార వినాశిత్వాద్గురు రిత్యభిధీయతే.

తా॥ గుకారము తమస్సనబడును. రుకారముదానిని రహితమొనర్చునదగును. అంధకారమైన అజ్ఞానమును రహితమొనర్చు వాడగుటఁజేసి గురువు అనిచెప్పబడుచున్నది.

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః
గుణరూపవిహీనత్వాద్గురురిత్యభిధీయతే.

తా॥ గుకారము గుణాతీతము, రూపాతీతమురుకారము, గుణరూపములు లేనివాడగుటచే గురుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ న సుఖం వేదశాస్త్రేషు న సుఖం మన్త్రయన్త్రకే
గురోః ప్రసాదాదన్యత్ర సుఖం నాస్తి మహీతలే.

తా॥ వేదశాస్త్రములలో సుఖములేదు. మన్త్రయన్త్రములలోను సుఖములేదు. భూలోకమున గురువరునిప్రసాదమున కన్యమగుసుఖము యెచ్చటనులేదు.

శ్లో॥ న తత్సుఖం సురేన్ద్రస్య న సుఖం చక్రవర్తినామ్
యత్సుఖం వీతరాగస్య మునేరేకాన్తవాసినః.

తా॥ యేసుఖమైతే రాగములేనిమునియైన ఏకాంతవాసియైనవానికి యుంటున్నదో అట్టిసుఖము దేవేన్ద్రునకును ఉండుటలేదు. అట్లుండగా చక్రవర్తులవిషయమై యేమిచెప్పవలయును.

శ్లో॥ నిత్యం బ్రహ్మరసం పీత్వా తృప్తోయః పరమాత్మని
ఇన్ద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కాకథా.

తా॥ నిత్యము బ్రహ్మానందరసమును పానముజేసి ఎవడుపరమాత్మ యందు తృప్తుడై యుంటున్నాడో అట్టిమహానుభావుడు ఇన్ద్రుని భృత్యునిగా తలంచుచుండగా, అతటిరాజులకొక్క కథ యేమనిచెప్పగలను.

శ్లో॥ యతః పరమకైవల్యం గురుమార్గేణ వై భవేత్
గురుభక్తిరతఃకార్యా సర్వదా మోక్షకాంక్షిభిః

తా॥ యేకారణమువల్ల గురుమార్గము ననుసరించుటచే పరమకైవల్యప్రాప్తిగల్గునో, ఆకారణమువల్ల మోక్షమును గోరువారందరు ఎల్లప్పుడు గురుభక్తిగల్గి యుండవలయును.

ఓమ్.

---

# 10. గురు భేదము.

గురువులలోగల తారతమ్యము ఇదివఱలో వ్రాయబడిన కొన్ని గ్రంథములలో తెలుపబడియుండినను యీగ్రంథముగురుభక్తిని గూర్చి చెప్పునదగుటచే అట్టితారతమ్యముగూడ యిచ్చుటనిరూపించుటయుచిత మని తలంచడమైనది. ఏలనన తక్కినగ్రంథములు గొప్పవగుటల్లను వాటి పేరులుగూడ వేరగుటచేతను యీతత్త్వమువెదకి తెలిసికొనుట సామాన్యుల కవగాహనముగాదనితలంచి యిది యిచ్చుటచేర్చడమైనది.

శ్లో॥ చాతుర్యవాన్ వివేకీచ అధ్యాత్మ జ్ఞానవాన్ శుచిః
మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే.

తా॥ కార్యనిర్వహణ చాతుర్యము గలవాడును, వివేకజ్ఞానముగల వాడును, అధ్యాత్మజ్ఞాన సంపన్నుడును, బాహ్యాభ్యంతర శుచిత్వము గలవాడును, నిర్మలమైన మనస్సుగల వాడెవడో, వానికే గురుత్వము శోభించును. అనగా వాడే గురుపదమున కర్హుడు.

శ్లో॥ గురవో నిర్మలాశ్శాంతాః సాధవోమిత భాషిణః
కామక్రోధవినిర్ముక్తాః సదాచారా జితేన్ద్రియాః.

తా॥ సంసార మాలిన్యములేని వారును, ప్రకృతిదోషము క్షమించిన వారును, సాధుస్వభావము గలవారును, (సాధనపరులును) మితభాషణ గలిగి యుండు వారును, కామక్రోధ మోహలోభాదులు లేనివారును,

సదాచార సంపన్నులును సర్వేంద్రియములను జయించిన వారెవరో వారే గురువులగుట కర్హులు.

శ్లో॥ సూచకాది ప్రభేదేన గురవో బహుధా స్మృతాః
స్వాయం సమ్యక్ పరీక్ష్యాథ తత్త్వనిష్ఠంభ జేత్సుధీః.

తా॥ సూచకాది భేదముచే గురువులు పలుతెఱంగులుగా నుంటున్నారు. అందువల్ల తాను స్వయముగా లెస్సగా పరిశోధించి బుద్ధిశాలియగు వాడు తత్త్వజ్ఞాన నిష్ఠగల వానినే యాశ్రయించ వలయును.

## (1) సూచకుడు.

శ్లో॥ వర్ణజాలమిదం తద్వద్బాహ్య శాస్త్రం తు లౌకికమ్
యస్మిన్ దేవి సమభ్యస్తం స గురుస్సూచకస్స్మృతః

తా॥ ఓ పార్వతీ! యెవనివల్ల అకారాది అక్షరసమూహములున్ను ఆలాగున లౌకికములగు బాహ్యశాస్త్రములున్ను, అభ్యసించబడునో, అట్టి వాడు సూచక గురుఁడనంబడును.

## (2) వాచక గురుడు.

శ్లో॥ వర్ణాశ్రమోచితాం విద్యాం ధర్మాధర్మ విధాయినీం.
ప్రవక్తారం గురుం విద్ధి వాచకంత్వితి పార్వతి.

ఓ భవానీ! వర్ణాశ్రమములకు సంబంధించినదియు ధర్మా ధర్మముల దెలుపునదియనగు విద్య యెవనివల్ల అభ్యసింపబడునో అట్టి వానిని వాచక గురుఁడని తెలియదగినది.

## (3) బోధకుడు.

శ్లో॥ పంచాక్షర్యాది మన్త్రాణా ముపదేష్టాతు పార్వతి
స గురుర్బోధకో భూయాదుభయోరయము త్తమః॥

తా॥ ఓ గౌరీ! పంచాక్షరీ మొదలైన మన్త్రములను ఉపదేశించువాడు బోధకుడనంబడును. మునుపు జెప్పిన యుభయులకంటెను యీతడధికుఁడు.

## (4) నిషిద్ధ గురుడు.

శ్లో॥ మోహమారణ వశ్యాది తుచ్ఛమన్త్రోపదేశనమ్
నిషిద్ధగురు రిత్యాహుః పండితాస్తత్వదర్శినః.

తా॥ మోహనము మారణము వశ్యము మొదలగు నీచమ న్త్రము లనుపదేశించువాడు నిషిద్ధగురుఁడని తత్త్వజ్ఞానులగు పండితులు తెలుపు చున్నారు

## (5) విహిత గురువు.

శ్లో॥ అనిత్యమితి నిర్దిశ్య సంసారం సంకటాలయం
వైరాగ్యపదదర్శీ యః స గురుర్విహితః ప్రియే।

తా॥ ఓ ప్రియమైనపార్వతీ! సకల సంకటములకు నిలయమైన సంసారమును అనిత్యమని నిరూపించి వైరాగ్యపదమును జూపెడు గురుడెవడో వాడే విహితగురువనంబడును.

## (6) కారణ గురువు.

శ్లో॥ తత్త్వమస్యాది వాక్యానాముపదేష్టా తు పార్వతి
కారణాఖ్యో గురుః ప్రోక్తో భవరోగనివారకః॥

తా॥ ఓ భవానీ! తత్త్వమస్యాది మొదలగు వాక్యములను ఉపదేశించువాడును, భవరోగమును నివారించు వాడును, అగు గురువెవరో అట్టి గురువు కారణగురువని చెప్పబడును.

## (7) పరమ గురువు.

శ్లో॥ సర్వ సందేహ సందోహ నిర్మూలన విచక్షణః
జన్మమృత్యు భయఘ్నో యః స గురుః పరమోమతః॥

తా॥ సందేహములన్నిటిని కూకటివేళ్ళతోగూడ నివృత్తిజేయుటలో సమర్థుడును, జనన మరణభయమును నివర్తించువాడును యెవడో వాడే పరమగురుఁడని గణింపబడును.

ఈ సప్తగురువులలో నిషిద్ధగురువు తప్ప తక్కిన ఆరుగురును అంగీకరించదగిన వారలే. అయితే ఒకరికంటె మరొకరు అధికులు, కట్టకడకు పరమగురుఁడు, సర్వజ్ఞుడు సర్వేశ్వరస్వరూపుఁడు. యీ పరమ గురుస్థానము శ్రీ దక్షిణామూర్తి యొకరికి మాత్రమే గలదు.

శ్లో॥ సర్వకాల వి దేశేషు స్వతంత్రో నిశ్చలస్సుఖీ
అఖండైకరసస్వాద తృప్తో హి పరమోగురుః॥

తా॥ సర్వకాలములయందు సర్వదేశములయందును స్వతంత్రుడును వికారరహితుడును, సుఖియును, అఖండైక పరబ్రహ్మరసాస్వాదముచే తృప్తుఁడును, అగు గురుదేవుడు పరమ గురుఁడనంబఁడును.

ఓమ్.

---

# 11. గురు దీక్షాత్రయము.

గురుదీక్షయనియు, మన్త్రదీక్షయనియు, మన్త్రపురశ్చరణ యనియు, యుంటున్నది. మన్త్రోపదేశ మయిన తరువాత ఆచరించవల సినకొన్ని ధర్మములుగలవు. మన్త్రదీక్షయనగా మూడు సంవత్సరములు దీక్షవహించి మన్త్రమును ఆత్మ శుద్ధికొఱకును, పాపశమనము కొఱకును ఇష్టదైవానుగ్రహము కొఱకును జపమాచరింపవలయును. మన్త్రపు రశ్చరణయనగా ఏమన్త్రము యెన్ని సంఖ్యలవఱకు జపమొనర్చిన శుద్ధి యగునో, లేక శుద్ధమగునో, అని ఆయామన్త్రములకు విధానముగలదు. సాధారణముగా అక్షరలక్షము జపించిన మన్త్రసిద్ధి, లేక, మన్త్రశుద్ధి గలుగును. దీనివల్ల పూర్వజన్మపాపకర్మలన్నియు నశించునదే గాక, యిష్టదేవతానుగ్రహము గూడ గలుగును. అట్టి సిద్ధియైన మన్త్రము మాత్రమే ఫలవంతమగును. అంతేగాక అట్టి మన్త్రసిద్ధి గలిగినవాడే ఆమన్త్రమును మరొకరికి ఉపదేశించుట కర్హుడగును. అట్లైన ఉపదేశము పొందిన వారికి ఆమన్త్రముత్వరలో సిద్ధించును. అట్లుగాక ఉపదేశించిన ఉపదేశము పొందినవారికి ఫలములేక పోవునదేగాక ఉపదేశించినవానియొక్క పుణ్యము తపస్సుగూడ క్షయించును. కావుననే ఏమన్త్రమైనను స్వయముగా అనుష్ఠించఁగూడదనియు, గురుముఖముగా గ్రహించుకొనవల వలయుననియు చెప్పుటకుకారణము.

శ్లో॥ మృద్వాసనే సమాసీనో జిత చిత్తేంద్రియక్రమః
ఓ మిత్యుచ్చార యేత్తావన్మనో యావత్ప్రసీదతి॥

తా॥ మెత్తని ఆసనమందు గూర్చుండి, యింద్రియాది వృత్తులను నిశ్చలముగా జేసికొని మనస్సులీనమై బ్రహ్మాకారమగు పర్యంతం ఓంకార మన్త్రమునుగాని లేక ఓంకారముతో గూడిన ఇతర మన్త్రములనుగాని

పరమాత్మ పరముగా భావనచే ధ్యానము చేయవలయును. మృదువైన ఆసనముండిన మృదువైన ఆసనములో గూర్చుండిన పాదమునకు నొప్పి గలుగదు. కఠినమగు ఆసనమైనచో నొప్పి యేర్పడును. అప్పుడు కాలు మార్చుకొని కూర్చుండేలాగున తటస్థించును. అదియోగనిష్ఠకనుకూలము గాదు.

శ్లో॥ ఋషింఛందోఽధిదైవంచ ధ్యాయేన్మంత్రస్య సత్తమే
యస్తు గార్గి జపేన్మంత్రం తదేవ హి ఫలప్రదమ్॥

శ్లో॥ భవేద్వీర్యవతీ విద్యా గురువక్త్ర సముద్భవా
అన్యథా ఫలహీనాస్యాన్నిర్వీర్యాప్యతిదుఃఖదా॥

తా॥ ఓ గార్గీ! ఎవడు మన్త్రి ధ్యానమునకు ముందుగా ఋషి, ఛందస్సు దేవతాదులను న్యాసముజేసి ధ్యానించునో ఆ మంత్రము మాత్రమే ఫలసిద్ధిని గలుగజేయును. మరియు బ్రహ్మనిష్ఠుడగు గురు ముఖమునుండి మంత్రశ్రవణ జేయబడినమంత్రము ప్రకాశమానమై శక్తి యగు వీర్యముతో గూడినదిగానుండును. అట్లుగాని మంత్రము ఫల హీనమైనదియు ప్రాణశక్తి లేనిదియు దుఃఖముగలుగ జేయునదిగా యుండునని యాజ్ఞవల్క్య మహర్షి శివసంహితయందు దుపదేశించెను. మరియు కలియుగమున మంత్రమునకున్ను మూలికలకున్ను అగస్త్యుల వారిశాపముగలదని పెద్దలుచెప్పుదురు. గురుముఖమునుండి వచ్చినదైన ఆ శాపము లేనిదిగానుండును. ఇదిమంత్ర మొకదానికి మాత్రముగాదు. యోగ, జ్ఞాన, తపస్సులు మొదలగువాటికన్నిటికిని సంబంధపడియున్నది. గురుభక్తి ప్రవాహమును ఆ మహాసభలో బోధించిన ఆపరమభక్తుడేలాగున గురుస్వరూపుడై స్వయం ప్రకాశజ్ఞాన స్వరూపుడై యుండెనో, ఆ దీక్షాత్రయ ప్రకారమును క్రింద తెలిపెద. దీక్షాత్రయమనగా మూడు విధములదీక్షలని భావము.

శ్లో॥ వీక్షణ ధ్యాన సంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వత్పండితవృత్తయః

తా॥(వీక్షణము) చూచుటచేతను ధ్యానముచేతను హస్తసంసయోగము చేతను, మీనము, కూర్మము, పక్షులు తమతమ సంతానములను తమ

రూపములుగా చేయుచున్నవి. ఆలాగున బ్రహ్మవేత్తలుగూడ తమభక్తులను, శిష్యులను వీక్షణముచేతను, ధ్యానముచేతను, హస్తమస్తక సంయోగముచేతను తనవలెనే చేయుదురు.

శ్లో॥ యథా పక్షీ స్వపక్షాభ్యాం శిశూన్ సంవర్ధయేచ్ఛనైః
స్పర్శదీక్షోపదేశస్తు తాదృశః కథితః ప్రియే.

తా॥ ఇది పరమశివుండు పార్వతీదేవికుపదేశించినది = ఓ పార్వతీ?. స్పర్శదీక్షా విధానము వినుము. యేలాగున పక్షి తన రెండురెక్కల లోపల గ్రుడ్లనుంచుకొని తన వలెనేపిల్లలుగా చేయుచున్నదో, ఆలాగున ఆత్మ బోధస్వరూపులగు గురువు హస్తమస్తకసంయోగముచే శిష్యుల యొక్క ఆవరణము తొలగించి తనవలెనే చేయుచుండును.

వి. జడమైన గ్రుడ్డుయొక్క చిప్పలోపులనుండు అచేతనపదార్థము చైతన్యవంతమై గుడ్డు చిప్పను పగులగొట్టి బయటికివచ్చుచుండునో, ఆలాగున జడమైన అవిద్యా ఆవరణముతోగూడిన శిష్యుని గురుదేవుడు చైతన్య రూపునిగాచేసి అవిద్యా ఆవరణము తొలగించి తనవంటి వానినిగాచేయుచుండును.

ధ్యానదీక్షా విధానము.

శ్లో॥ స్వాపత్యాని యథా కూర్మీ ధ్యానమాత్రేణపోషయేత్
వేత్త దీక్షోపదేశస్తు మనసః స్యాత్తథా విధః.

తా॥ ఓ భవానీ? కూర్మమేలాగున గ్రుడ్లను యెచ్చటనోపెట్టివేసి, నీటిలోగాని ఇతరస్థలములోగానియుండి, మనస్సులోపిల్లలను తనరూపముగా యుండేలాగున ధ్యానముచేయుచున్నదో, ఆలాగున ఆత్మనిష్ఠగల గురుడును, తనశిష్యులు యెంతదూరముగానుండినను తనవలెనే యుండేలాగున మనస్సులో ధ్యానము చేయుచుండును. తాబేలుగ్రుడ్లను పక్షి గ్రుడ్లవలె అచేతనములై డిబ్బతో ఆచ్ఛాదనమైయుండినను, కూర్మధ్యానమువల్ల ఆవరణముతొలగి చైతన్యరూపమగు చున్నదో, గురుధర్మమున్ను ఆలాగునయుండును.

దృగ్ దీక్షావిధానము.

శ్లో॥ యథా మత్స్యీ స్వతనయాన్ వీక్షణేనైవ పోషయేత్
దృగ్దీక్షాఖ్యోపదేశస్తు తాదృశః కథితః ప్రియే.

వి॥ ఓగారీ! యేలాగున మత్స్యము గ్రుడ్లనుచేసి పోయినపిమ్మట ఆగ్రుడ్లపై తనదృష్టిని నిమిడి కొంతసేపు చూచుచుండిన ఆగ్రుడ్లన్నియు, పిల్లలై తనదగ్గరకువచ్చి చేరుచుండును. యేగ్రుడ్లపై మత్స్యముయొక్క దృష్టితగులలేదో, ఆవి పిల్లలు కావు, అంతేగాదు వాటిని ఇతర జలజంతువులు తినివేయుచుండును. యీలాగున గురుదేవునియొక్క కరుణాకటాక్ష వీక్షణమువల్ల శిష్యులయొక్క జడత్వమున్ను, ఆవరణమున్ను, తొలగిపోయి తనవలెనే జీవన్ముక్తులగుదురు.

వి॥ తల్లిచేపయొక్క దృష్టి యేగ్రుడ్లపై తగులలేదో, అదిమీనము గాక పోవుటయే గాక, ఇతరజలచరములు తినివేయునట్లు గురుదేవుని యొక్క కరుణాకటాక్ష వీక్షణము యెవనిపై ప్రసరించలేదో, అతడు ఆత్మ జ్ఞానమును పొందక పోవుటయేగాక, ప్రకృతిచే మ్రింగబడిన వాడగును. మరియు కొన్ని శాస్త్రములలో దీక్షా చతుష్టయముగలదు. అచ్చట భ్రమరకీటక న్యాయమనునది మరొకటిగలదు. ఇదిమంత్రోపదేశమును గురించి తెలుపు నదగును.

శ్లో॥ భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా.
పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమర కీటవత్.

తా॥ భావనాశుద్ధి గలపురుషుడు (వడివడిగా) తీవ్రముగా దేనినిగూర్చి భావన చేయునో అది ఆలాగుననే పరిణమించును. యెట్లన భ్రమరము కీటకమును తెచ్చి గూటిలోనుంచి ఝ్రీంకార (అనగా ఓంకార) ధ్వనిని చేయుటవలన ఆక్రిమిభ్రమరమును నిరంతరము భావనచేయుట వలన పురుగుధర్మముపోయి తుమ్మెదరూపమై బయటికివచ్చును. ఇదికొంచెము మందప్రజ్ఞగల శిష్యుని ధర్మమై యున్నది. వీడుకొంతకాలము గొండ గృహాలలోగాని, ఏకాంతప్రదేశమునందుగాని, యుండి గురూపదిష్టమగు మంత్రమునుగాని ధ్యేయస్వరూపమును తదేకనిష్ఠతో తీవ్రవైరాగ్యముతో నుండిన గురువుమాదిరిగా కాగలుగును. అనగా జీవత్వ రహితమై బ్రహ్మత్వ మొందును.

ఆపరమ గురుభక్తుడు యేలాగున గురుదేవుని భావనయందు మగ్నమైన మనస్సుగలవాడగుటచే గురురూపుడాయెనో, ఆవిధమును వినుడు,

శ్లో॥ అగ్నావపఘృతం సర్వమగ్నిరేవ భవేద్యథా
విదితం విదితం వేద్యం సంవిదేవ భవేత్తథా.

శ్లో॥ కర్పూరో దీపసంసర్గాద్దీపఏవ భవేద్యదా
వేద్యవేదన సంసర్గాత్సంవిదేవ భవేత్తథా.

శ్లో. సంవిదితం సంవిదితం సంవిన్మయైవ భవతి సంవేద్యమ్
అగ్నావాహితమాహితమగ్నిమయం కిం న జాయతే కాష్ఠమ్.

తా॥ అగ్నియందు హోమముచేయబడిన నేయియంతయు నెట్లగ్నియే అగునో, అట్లు తెలియదగిన స్వస్వరూపజ్ఞానానుభవము గలుగగా కలుగగా జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునేపొందును.

తా॥ కర్పూరమునకు దీపపుసంబంధమువలన నెట్లుదీపమగునో అట్లే తెలియదగిన బ్రహ్మ స్వరూపజ్ఞానానుభవమువలన జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునేపొందును.

తా॥ అగ్నియందు గట్టెలనువేసి కొంతసేపుంచిన నెట్లుక్రమముగా నవి యగ్నిఅగునో అట్లు స్వస్వరూపమును గురూపదేశప్రకారము భావింప భావింప జ్ఞానస్వరూపియగు తానే బ్రహ్మముయగును.

ఈ ధర్మానుసారముగానే నిరంతరము గురుస్వరూపమును ధ్యానించుచూ వచ్చినందుచే ఆ పరమగురుభక్తోత్తముడును, పరమ గురుస్వరూపమగు బ్రహ్మమునుపొందెను. అందువల్లనే యామహాను భావుడు బ్రహ్మాకారమగు పరమనిర్వాణము నొంది యిప్పుడుండుటకు కారణమైనది.

అయితే మోక్షద్వారమనియు ప్రకృతిద్వారమనియు రెండుద్వారములుగలవు. ప్రకృతిద్వారము యెంతవఱకు తెరవబడియుండునో అంత వరకు మోక్షద్వారము మూయబడియుండును. ప్రకృతిద్వారమెపుడు మూతబడునో అప్పుడు మోక్షద్వారమగు బ్రహ్మరంధ్రము స్వయము గానే తెరవబడును. ఇదియే బ్రహ్మవిద్యలోగల పరమరహస్యము. ఆ ద్వారములెవ్వియనగా

శ్లో॥ పృథివ్యాం యాన్తి భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్
జిహ్వోపస్థ పరిత్యాగే పృథివ్యాం కిం ప్రయోజనమ్.

"కో నముచ్యేత బంధనాత్" అనిపారాంతరము,

తా॥ ప్రపంచములో గల సర్వప్రాణి కోట్లున్ను, జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ నిమిత్తముగానే సకల కార్యములను చేయుచున్నవి. లేక జిహ్వేంద్రియ గుహ్యేంద్రియములకే, పృథివిలో బద్ధులగుచున్నవి. జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ విషయ పరిత్యాగము గలిగిన వానికి లోకముతో యేమి ప్రయోజనము లేక యట్టి వాడెవడు ముక్తుడు గాకున్నాడు! అనగా యీ రెండు ఇంద్రియ విషయములనుండి విముక్తి గలవాడు జీవన్ముక్తుడగును. యెంతవరకు యీ రెండింద్రియములనుండి విముక్తుడుగాడో అంతదనుక బద్ధుడగును.

వి = మానవునికిగల శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములగు జ్ఞానేంద్రియములై దింటికిని కర్ణ, చర్మ, నేత్ర, జిహ్వా, ఘ్రాణమనుఘ్రాణేంద్రియములు స్థానములు. ఆలాగున వాక్కు, పాణి, పాద, పాయూపస్థలగు కర్మేంద్రియము లై దింటికి జిహ్వా, కరము, చరణము, గుహ్యము, గుదములు స్థానములు. అయితే అన్ని యింద్రియములు తత్త్వద్విషయములలో ప్రవర్తించుటకు బంధము లేదనియు జిహ్వోపస్థల విషయము లే బంధమనియు చెప్పుటకు కారణమేమియోఅదియే మనకువిచారణీయము. శబ్ద, స్పర్శ రూపాది విషయేంద్రియములకు ఒక్కొక్క వృత్తియే గలదు. అనగా కర్ణేంద్రియమునకు శబ్దజ్ఞాన మొక్కటియే, చర్మేంద్రియమునకు స్పర్శజ్ఞానమొక్కటే, నేత్రేంద్రియమునకు రూపజ్ఞానమొకటియే, జిహ్వేంద్రియములో రెండువృత్తులు గలవు. వాగ్వృత్తి కర్మేంద్రియమొకటి. రసవృత్తి జ్ఞానేంద్రియమొకటి యనురెండు వృత్తులుగలవు. కావున రుచిని గోరుచుండు యొకవృత్తినితొలగింపుము. ఆలాగున గుహ్యేంద్రియమునకు గూడ రెండువృత్తులు గలవు. ఒకటి జలవిసర్జనము, రెండవది మరొకటి కావున దేహసంరక్షణ కొఱకు జలవిసర్జన వృత్తినొకదానినుంచి మరొకటున్నదే దానినితొలగించుము. అప్పుడు తక్కినయింద్రియముల కన్నిటికిని యేకవృత్తి మాత్రమున్నట్లు యీ రెండింద్రియములకున్ను ఏకైక వృత్తియే యుండును. అప్పుడు మాత్రమే సర్వములోను ఏక రూపమై యుండు ఆత్మను చూడగలుగును. కావున ప్రపంచములోగల మహానీయులందరున్ను యీరెండు వృత్తులనుండి విముక్తులై నవారుగా యుండుటకు కారణము.

ఇదే బ్రహ్మచర్యము యొక్క ప్రయోజనమని మరువకుడు. దీనికే ఊర్ధ్వకుండలి యనియు, అధోకుండలీ బంధమనియు చెప్పెదరు రహస్యము. దీనిని తెలుసుకొనక కొందఱు ఆకుంచనాది సాధనలచే కుండలీ బోధము గలుగజేయుటకు ప్రయత్నింతురు. ప్రాకృతజనులకు యీ కుండలీ సుషుప్తిలో యుండు సర్పముపోలె మూలాధారమునందుండుననియు, యోగముచేత ప్రబోధమొందిన సర్పముపోలె లేచుననియు చెప్పుదురు. దీనియందుర రహస్యార్థముగలదు జీవుడెంతవఱకు దృశ్యవిషయ అనాత్మ భావము గలిగియుండునో, అదే అధోకుండలియనియు, దృశ్య విషయ అనాత్మలకన్న ఆత్మయు తాను విలక్షణముగా యుండునని జ్ఞాన బోధము గలుగుటన్నే ఊర్ధ్వకుండలి బోధయనియు గ్రహించతగినది. సుషుప్తిలోయుండు వాడు తానెవడు, ఎచ్చటునాన్నడు, దేనికొఱకు వచ్చినాడు, అనుజ్ఞానము లేకయుండునో, జాగ్రతావస్థకు వచ్చినపుడు తానెవడు, యెచ్చటునాన్నడు, ఎందుకొఱకు వచ్చినాడను బోధమేలాగుగలుగుచుండునో, ఇదే కుండలియొక్క సుషుప్తికిన్ని ప్రబోధమునకున్ను అర్థమగును. దీనికి సుషుమ్నానాడియొక్క నిద్రయు, జాగ్రతయు యనియు, హృదయ కమలముయొక్క సంకోచమనియు, వికాసమనియు, చెప్పెడు రహస్యమగును. ఇది ప్రకృతిదోష రహితము గలుగునపుడే జీవులకు కలుగును. దానికి యోగమార్గమొకటి మాత్రముగాదు. అనన్యమగు దైవభక్తియు, ఫలాపేక్ష రహితమగు నిష్కామకర్మయోగమున్ను, బ్రహ్మవిచారమగు జ్ఞానయోగమున్ను, ఫలమును గలుగ జేయును. దీనిలో ఒక్కొక్కరి పూర్వజన్మ సంస్కారము ననుసరించి ఒక్కొక్కరికి ప్రవృత్తి గలుగును. యేవిధమైనను ప్రకృతిగుణములు మాత్రము రహితముగావలయును. అదేదీనియొక్క ముఖ్యతాత్పర్యము.

శ్లో॥ తావజ్జితేంద్రియో న స్యాద్విజితాన్యేంద్రియః పుమాన్
న జయేద్రసనం యావజ్జితం సర్వం జితేరసే.

తా॥ పురుషుండెందాక రసనేంద్రియమును జయించలేడో, అందాక తక్కిన సర్వేంద్రియములను జయించినవాడై యుండినప్పటికిన్ని జయించినవాడుకాడు. యెప్పుడైతే రసనేంద్రియమును జయించునో, అప్పుడు సర్వేంద్రియముల జయించినవాడగును. ఏలఇట్లు చెప్పుటకు కారణమేమన

రసనేంద్రియముద్వారా ఉదరములోనికెళ్లెడు ఆహారపదార్థముల యొక్క సారమువల్లనే తక్కిన గుహ్యేంద్రియములన్నియు, బలవంతములుగా గావలసియున్నవి. కావున రసనేంద్రియ నిగ్రహము గలిగి రజోగుణ తమోగుణముల వృద్ధిపరచెడు ఆహారములను త్యజించి సత్వగుణములను వృద్ధిపరచెడు ఆహారములను తనజీవితకార్యమును నిర్వహించుట కెంతమాత్రము కావలయునో, అంతమాత్రము భక్షణ మేర్పాటుగలిగిన మాత్రమే యింద్రియములన్నియు, నిగ్రహములో నిలుచును. తక్కిన మనస్సేప్రధానమని చెప్పెడు వాక్యములకు లోబడి చెడిపోవకుండు. మనస్సేప్రధానమను దానికి సరియగు అర్థము శ్రీశుష్కవేదాంతతమో భాస్కరాది గ్రంధములలో వ్రాయబడియున్నది.

శ్లో॥ ఇంద్రియేషు చ సర్వేషు వాగుపస్థౌ మహాబలౌ
ఆదౌ తయోర్జయేయత్నం కుర్యాద్యోగీ విశేషతః.

తా॥ ఇంద్రియము లన్నిటిలోను జిహ్వేంద్రియ గుహ్యేంద్రియములు మిక్కిలిబలముగలవి. కావున యోగియైనవాడు ప్రప్రథమున యీ రెండింద్రియములనే జయించుటకు విశేషముగా ప్రయత్నించవలయును.

పరమనిర్వాణస్థితిలో బ్రహ్మానందసాగరములో నోలలాడుచుండు ఆ గురుభక్తునికి అట్టిస్థితి యెట్లుకలిగెనో యింకను కొంచము తెలిపెద.

శ్లో॥ ముకురే రవిసంయోగాద్యథోద్గచ్ఛతి పావకః
శిష్యానుభవనైర్మల్యం తథా సద్గురు సంగతః.

తా॥ సూర్యకాంతరత్నమందు సూర్యరశ్మి పడునపుడు యేలాగున అగ్ని ప్రజ్వలించు చుండునో, ఆలాగున శిష్యుని యొక్క నిర్మలమైన హృదయమందు సద్గురుబోధమువల్ల జ్ఞానాగ్ని ప్రకాశించును.

వి :- సూర్యరశ్మి భూమియందంతటను ఒకే విధముగానే పడినప్పటికిన్ని విశుద్ధ శుద్ధ మలిన భేదములచేత భిన్నఫలమై మారుచుండును. మలిన ప్రదేశమందు సూర్యబింబము కనుపించదు. శుద్ధమైన అద్దమందు సూర్యబింబము స్పష్టముగ గోచరించును. విశుద్ధమగు సూర్యకాంత రత్నమునందు పడునపుడగ్నిగా వెలుగు చుండును. శిష్యుని యొక్క మనోనైర్మల్య భేదముచేతనే ఒకడు గొప్పవాడుగను, మరొకడు సామాన్యుడుగను, ఇంకొకడు యెందులకు పనిరానివాడుగను అగుటకుకారణము,

శ్లో॥ చంద్రకాంతమణిః సోమం ద్రవతే చంద్రసన్నిధౌ
శిష్యానుభవనైర్మల్యం తథా సద్గురు సన్నిధౌ.

తా॥ చంద్రునియొక్క చంద్రిక, చంద్రకాంతమణియందు పడునపుడేలాగున ద్రవమునుస్రవించుచున్నదో, ఆలాగున శిష్యులయొక్క అంతఃకరణ నైర్మల్యముచే సద్గురుసన్నిధిలో ఆనందామృతర్సావామృతముగలుగును. యిదిన్ని గురువుయొక్కభేదముగాదు. శిష్యులయొక్క మనోనిర్మలభేదమేగాని మరొకటిగాదు.

శ్లో॥ గురుభక్తిం సదాకుర్యాచ్ఛ్రేయసే భూయసే నరః
గురురేవ శివస్తస్య నాన్య ఇత్యబ్రవీచ్ఛ్రుతిః.

తా॥ మానవుడు గొప్పదగు శ్రేయస్సును (అనగామోక్షమును) పొందవలయునని తలంచెనేని యెల్లప్పుడును గురుభక్తి గలిగియుండవలయును. అట్టిగురుభక్తిగలవానికి గురుదేవుడేసాక్షాచ్ఛివుడు, అన్యుఁడు కాఁడు. యీలాగున వేదమాత యుపదేశించుచున్నది.

శ్లో॥ కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన
అపారసచ్చిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.

తా॥ యెవనిమనస్సు ఒకక్షణకాలమైనను అపారజ్ఞానసాగరమగు పరమాత్మయందు లీనమగునో, అట్టివాని కులముపవిత్రమగును. తల్లి కృతార్థురాలగును, తండ్రియున్ను కృతార్థుఁడగును. వాఁడునివసించు భూమి గూడ పుణ్యభూమియగును. ఓమ్.

---

ఓమ్.

# 12 ధర్మ రహస్యము.

ఆపరమభక్తునికి గురుభక్తివలన గలిగిన ఆత్మప్రబోధజ్ఞానమంతయు ధర్మానుష్ఠానసహాయమువల్లనే పూర్ణముగాసిద్ధించెను. బీజముమాత్రము మంచిదైనను, భూమి మంచిసారవంతమైనది కాకపోయినను, సరియైన పోషణ లేకపోయినను, యేలాగున వృక్షమై పరిణమించిపూర్ణమైన ఫలము నివ్వజాలదో, ఆలాగున సాధకులకు గొప్పమహాత్మునివల్ల యుపదేశము సిద్ధించి

నను తనహృదయము శుద్ధిలేకపోయినను చక్కనియనుష్ఠానము లేకపోయి
నను పూర్ణజ్ఞానముగలుగదు. ఆవిషయమై ప్రమాణ శ్లోకములిచ్చట
నిరూపించెద.

శ్లో॥ సత్యంతపోజ్ఞానమహింసతాచ విద్వత్ప్రిణామం చ సుశీలతాచ
ఏతానియోధారయతే సవిద్వాన్ న కేవలం యఃపఠతేసవిద్వాన్.

తా॥ సత్యము, తపస్సు, జ్ఞానము, అహింసా, బ్రహ్మ నిష్ఠులయందు
నమ్రత, మంచిశీలము మొదలగు వానిని యెల్లప్పుడును తనలో కలిగి
యుండువాడే విద్వాంసుడగును. కేవల శాస్త్రమును మాత్రము పఠించిన
వాడుగాని, చెప్పువాడుగాని విద్వాంసుడుగాజాలడు.

శ్లో॥ అంత స్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకః
న నశ్యతి తమోనామ కృతయా దీపవార్తయా॥

తా॥ గృహాంతరాళములోగల చీకటి యెన్నిమారులు దీపముయొక్క
నామముచ్చరించినను ఎట్లునశించజాలదో, సరిగా దీపము వెలిగించినయెట్లు
నశించునో, ఆలాగున శబ్దశాస్త్రములను యెంత చదివినను చెప్పినను
అంతః కరణములోగల తమస్సు నశించదు. అది చక్కని జ్ఞాన జ్యోతిచే
మాత్రమేతొలగును. దీపమువెలుగ వలసియుండిన ప్రమిద, తైలము, వత్తి
గాలిలేని స్థలమెట్లవసరమో ఆలాగున వైరాగ్యమనెడి ప్రమిదయు అనన్య
భక్తియనెడు తైలమును, ఇంద్రియనిరోధమను వత్తియు, నిర్వాసన స్థితి
యను గాలిలేనిస్థలమున్ను సాధకులు చేసికొనవలయును. యీనాల్గింటిలో
యేది కొరతపడిన యెవరైనను దీపము వెలిగింపజాలరు. యీనాల్గున్ను
సమకూడిన మనుష్యమాత్రులలో యెవరైనను వెలిగించగలరు. అంతే
గాక యీనాల్గున్ను అమరిన తానెచ్చట యుండినను అచ్చటనే దీపము
వెలుగును. లేనిచో ఆశ్రమమునగాని మఠమునగాని వనమునగాని బద
రికాశ్రమమునగాని యుండినను దీపమెలుగజాలదు.

శ్లో॥ ఫలం కతక వృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్
న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి.

తా॥ పంకిలజలము చిల్లగింజయొక్క పేరును యెన్నిసారులుచ్చరించి
నను యేలాగున శుద్ధముగాజాలదో, చిల్లగింజను జలములో అఱగదీసిన
మాత్రమే యెట్లు శుద్ధమగునో, ఆలాగున వేదాంత వాక్యములను గాసి

శాస్త్రప్రమాణమ్ములుగాని, యెన్ని చెప్పినను వల్లించినను హృదయములో గల పాపమునశించి మనస్సు నిర్మలము గాజాలదు. తాను చెప్పినట్లున్ను చదివినట్లున్ను ఆచరించిన మాత్రముననే మనోమాలిన్యము తొలగి హృదయము నిర్మలమగును.

శ్లో॥ ఆశ్రమీ ధ్యాననిరతః సంశయచ్ఛిత్సుబుద్ధిమాన్
నిత్యానుష్ఠానసంయుక్తస్స్వాచార్యః పరికీర్తతః.

తా॥ బ్రహ్మచర్యాది యేయాశ్రమములో యుండినవాడైనను దానికితగిన అనుష్ఠానముగలవాడును, సదాధ్యానము చేయువాడును, సంశయములను భేదించిన వాడును మంచి బుద్ధిగల వాడును నిత్యానుష్ఠాన తత్పరుడున్ను అగు వాడెవడో వాడే యాచార్యుం డనబడును. అనగా యిట్టి గుణములుగలవాడే గురువని గ్రహించుకొనవలయును.

శ్లో॥ విజ్ఞాననావం పరిగృహ్య కశ్చిత్తరేద్యదజ్ఞానభవాంబుధిమ్ సదా
జ్ఞానాసినాయోహివిచ్ఛిద్యతృష్ణాం పరమంపదం యాతి స ఏవధన్యః.

తా॥ యెవడైతే అనుభవజ్ఞానమను నోడను పరిగ్రహించినవాడై అజ్ఞాన మయమగు సంసారసాగరమును దాటునో, మరియు జ్ఞానమైన ఖడ్గముచే యెవడైతే ఇచటనే విషవల్లీ సమూహమగు తృష్ణనుభేదించునో, వాడే పరమపదమును పొందును. యథార్థముగా వాడేధన్యుడు.

శ్లో॥ ఆచారాద్విచ్యుతోవిప్రో న వేదఫలమశ్నుతే
ఆచారేణ తు సంయుక్తః సంపూర్ణఫలభాగ్భవేత్.

తా॥ సర్వవేదముల నభ్యసించిన వాడైనను ఆచారహీనుడైనచో, స్వాధ్యాయజప ధ్యాన తపస్సుల యొక్క ఫలములను పొందజాలడు. ఆచరణతో గూడినవాడు పైనుదహరించిన స్వాధ్యాయ ధ్యాన జప తపస్సులకు యేఫలము శాస్త్రములో చెప్పబడినదో, దానిని సంపూర్ణముగా బొందగలడు.

శ్లో॥ యేన నారాధితో దేవో యస్యనో గుర్వనుగ్రహః
న వశ్యం హృదయం యస్య తస్య శాన్తిర్నసిధ్యతి.

తా॥ యెవడైతే పరమేశ్వరుని భక్తితో నారాధింపలేదో, యెవనికైతే గురుదేవుని అనుగ్రహము గలుగలేదో, యెవనికైతే హృదయము స్వాధీనముగాలేదో, నాతనికి ఉపరతియు ఆత్మశాంతియు గలుగదు.

శ్లో॥ న ప్రమాదోఽనర్థకరో జ్ఞానినః స్వస్వరూపతః
ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమోయథా.

తా॥ మోక్షేచ్ఛగల విద్వాంసుడు అనుష్ఠానము నందెప్పుడైనను, ప్రమాదముగలుగనీయక మిక్కిలి జాగ్రత్తతో చూచు చుండవలయును. ప్రమాదముగలిగినేని మాయవిజృంభించును. అనగా మాయఆవరించును. ఎట్లన సూర్యుడస్తమించిన వెంటనే ప్రపంచమంతయు యెట్లుతమస్సుతో ఆవరింపబడునో ఆలాగునయుండును.

శ్లో॥ ఆజీవితం త్రయస్సేవ్యా వేదాన్తో గురురీశ్వరః
పూర్వం జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వనివర్తయే.

తా॥ యెంతయాత్మజ్ఞానముగల వాడైనను బొందిలో ప్రాణముండు వరకు, మూడు విషయముల విడనాడగూడదు అవి యెవ్వియన (1) వేదాన్తశాస్త్రవిచారము, (2) గురుదేవుని యందు గల అపారభక్తి, (3) ఈశ్వరునియందు గల దృఢవిశ్వాసము, యివి మూడున్ను యెల్లప్పుడును సేవనీయములు. యేలనన పూర్వము యీమూడింటి వల్లనే జ్ఞానప్రాప్తి గలిగెను. అందువల్ల కృతఘ్నత్వము గలుగనీయక యుండుట కొఱకని ముక్తులైనను, ముముక్షువులైనను మరువగూడదు.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియోవైశ్యః శూద్రశ్చాండాలఏవ చ
దృఢాభ్యాసకరోనిత్యం పునర్జన్మ న విన్దతి.

తా॥ బ్రాహ్మణుడైనను క్షత్రియుడైనను శూద్రుడైనను అంత్యజుడైనను సరి, దృఢమైన బ్రహ్మనిష్ఠాభ్యాసము నిత్యము గలిగియుండెనేని వాడు పునర్జన్మమునొందడు. జీవన్ముక్తుడగును.

శ్లో॥ పతిహీనాయథానారీ మాతృహీనయథాశిశుః
గురుహీనస్తథాప్రాణీ తస్య జన్మనిరర్థకమ్.

తా॥ చిన్ననాటనుంచి భర్తలేని స్త్రీ యేలాగునో, ఆలాగున లేప్రాయములో తల్లిలేనిశిశు వెట్లో, ఆలాగున గురుదేవుడు లభింపనిమానవుడు కూడయుండును, ఈతనిజన్మ కూడ నిరర్థకము.

శ్లో॥ సదాయురారోగ్యమపారమూర్తిం
విద్యాం యశస్స్వర్గసుఖంచ మోక్షమ్
ఫలాని సర్వాణి నరస్సమాప్తుం
కథం సమర్థో గురుణావిహీనః.

తా॥ యెల్లప్పుడున్ను ఆయురారోగ్యమును, దివ్యశరీరమును, విద్యను, యశస్సును, స్వర్గసుఖమును మోక్షము మొదలగు సర్వఫల ప్రాప్తులను పొందుటకు గురుదేవునికరుణలేని వాడెట్లు సమర్థుడగును.

శ్లో॥ న శాస్త్రపాఠమాత్రేణ యోగసిద్ధిఃప్రజాయతే
న వేషధారణం సిద్ధేః కారణం న చ తత్కథా.

తా. శాస్త్రము పఠించుమాత్రముచేత జ్ఞానశుద్ధిగలుగదు. జ్ఞాన శుద్ధికొఱకు వేషధారణముగాని, వేదాన్త ఉపన్యాసములుగాని హరికథలు చెప్పుటగాని కారణములుగావు. వానికితగినయాచరణమే కారణమగును.

శ్లో॥ బహుజన్మకృతైః పుణ్యైర్వైరాగ్యం ఖలు జాయతే
వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచిన్నోపజాయతే.

తా॥ అనేక జన్మములలో జేసినసుకృతవిశేషమువల్ల విషయములలో విరక్తిగలుగును. ఇదిసత్యము. వైరాగ్యంవినా యెవరికిన్ని యెప్పటికి జ్ఞానోదయముగలుగజాలదు.

శ్లో॥ వేదాన్తానామనేకత్వాత్సంశయనాం బహుత్వతః
వేదస్యాప్యతిసూక్ష్మత్వాన్న జానాతి గురుంవినా.

తా॥ వేదాన్త శాస్త్రమనేక ముఖములతోగూడిన దగుటచేతను, శిష్యుల నేకవిధములగు సంశయములు గలుగువారగుటచేతను, తెలియదగిన బ్రహ్మవస్తువతి సూక్ష్మమగుటచేతను గురుదేవునికరుణలేనివారు దానిని తెలిసికొనజాలరు.

శ్లో॥ అయమాత్మా స్వయంజ్యోతిః మహానందమయశ్శివః
అయోగినః పరోక్షస్స్యాదపరోక్షశ్చ యోగినః.

తా॥ యీ ఆత్మస్వయం జ్యోతిస్స్వరూపమైనది. మహదానంద కరమైనది. శివమైనది, ఇది అయోగులకు అప్రత్యక్షము. యోగులకు ప్రత్యక్షముగానుండును అనగా యోగుల వేషములు మాత్రము వేయువారికి లభించునదిగాదు. నిజమైన యోగాద్యనుష్ఠానము గలవారికే లభించును,

## 12. ధర్మరహస్యము.

శ్లో॥ న ఆత్మా స చ విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః
తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్కదాచన.

తా॥ ముముక్షువు లందఱిచేతను తురీయమగు ఆయాత్మయే తెలిసికొనదగినది. అట్టి తుర్యాత్మజ్ఞానము లేనివారికి ఒకప్పుడును జీవన్ముక్తి గలుగదు.

శ్లో॥ సద్ధర్మశాసకో నిత్యం సదాచార నియోజకః
సంప్రదాయీ కృపాపూర్ణః విరాగీ గురురుచ్యతే॥

తా॥ సత్యధర్మములను శాసించువాడును, యెల్లప్పుడును శిష్యులను సదాచారములలో నియోగించువాడును, సాంప్రదాయానుగుణ్యముగా నడచువాడును, కరుణాపూర్ణుడును, సర్వవిషయములలో విరాగియునగు వాడే గురుపదమున కర్హుడని చెప్పబడును.

శ్లో॥ ఉక్తలక్షణసంపన్నమాచార్యం సర్వవేదినమ్
కర్మణా మనసా వాచా శివవత్పూజయేద్గురుమ్॥

తా॥ పైజెప్పిన లక్షణముగలవాడును, సర్వవేదాంత సారమెఱింగిన వాడును,ఆచార్యుడనబడును. అట్టి గురుదేవుడు మనస్సుతో వాక్కుతో కర్మతో యీశ్వరునివలె పూజింపదగినవాడు.

శ్లో॥ శైలే శైలేన మాణిక్యం మౌక్తికం న గజే గజే
సాధవో న హి సర్వత్ర చందనం న వనే వనే

తా॥ దీనియందు చెప్పబడిన గురుదేవుడున్ను, శిష్యుడున్ను లభించడము దుర్లభము. యెట్లన యెచటచూచినను రాళ్లు కొండలు కొండలుగా గనుపించునుగాని వాటిలో మాణిక్యమెంత దుర్లభమో ఆలాగున గజములనేకములుగలవు. కాని గజముత్యముగల ఏనుగెంత దుర్లభమో ఆలాగున యెచ్చట చూచినను విస్తారముగా వనములలో పలువిధములగు వృక్షములు కనుపించునుగాని, శ్రీ గంధపు చెట్లరుదుగా గనుపించునో ఆలాగున యెచట చూచినను సాధువులు గుంపులు గుంపులుగా కనిపించినను నిజమగు సాధనానుష్ఠానముగల సాధువు లభించుట గడుంగడు దుర్లభము.

శ్లో॥ తం త్యక్త్వా తాదృశం దేవం యస్సేవ్యేతాన్యదేవతాం
స హి భాగీరథీం త్యక్త్వా కాంక్షతే మృగతృష్ణికామ్॥

తా॥ ఎవడైతే సాధనానుష్ఠానపరుడై యాత్మసాక్షాత్కారముగల గురుదేవుని విడనాడి యితరదేవతలను సేవించుచు తిరుగునో, అట్టివాడు గంగాతీరమందుండి ఆపావన జలమును పానముజేసి సుఖింపక యెండమావులను చూచి అది మంచిజలప్రవాహమను భ్రాంతిగలిగి పరుగెత్తు వానివలె యుంటున్నాడు.

శ్లో॥ శిష్యాణాం జ్ఞానదానాయ లీలయా దేహధారిణే
సదేహోఽపి విదేహాయ తస్మై శ్రీ గురువే నమః

తా॥ శిష్యులకు ఆత్మజ్ఞానముమును అనుగ్రహించుట కొఱకు లీలామానుషధారియును, దేహముతోఁగూడినవాడై యుండియు విదేహామే ఆత్మస్వరూపముగలవాడును, నగు శ్రీ సద్గురు కొఱకు నమస్కారము.

ఇకను కొన్ని ధర్మములను గూర్చి తెలిపెద. అది ఆత్మశుద్ధిలేక వేషధారులై యుండువారిని గురించినదగుటచే దానికి ప్రత్యేకమొక పేరు పెట్టడము యీపవిత్రగ్రంథమునకు తగదని తలంచి వ్రాయలేదు. అయినను అదిన్ని ముముక్షువులు తెలిసికొన్న మాత్రముననే మోసములో పడకుందురని తలంచి వ్రాయడమైనది. అంతేగాక అట్లుండు వారు గూడ తమకాత్మశుద్ధిలేనిచో, పరమశాంతిగాని, సత్యపథముగాని, మోక్షముగాని గలుగదని తెలిసికొని సన్మార్గపరులై యుందురని తలంచి యిదివ్రాయడమైనది.

శ్లో॥ విహితస్యాననుష్ఠానాన్నిషేధస్య చ సేవనాత్.
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి.

తా॥ మానవునియొక్క పతనమునకు కారణమును యీశ్లోకము నిరూపించుచున్నది. తనకు విహితమైన అనుష్ఠానమును చేయకపోవుట చేతను, నిషిద్ధ కార్యము చేయుటవల్లను, యింద్రియముల యొక్క నిగ్రహములేక పోవుటచేతను, నరుఁడు పతనమొందుచున్నాడు.

శ్లో॥ తీర్థస్నానైస్తపోభిర్వా దుష్టాత్మా నైవశుద్ధ్యతి.
స్వేదితే క్షాళిత స్తీర్థే కిం శుద్ధిమధిగచ్ఛతి.

తా॥ ఆత్మ శుద్ధిలేనివాడు తీర్థస్నానములచేతగాని, తపస్సుచేగాని, యెప్పుడు శుద్ధుడుగాడు. యెట్లన చెమట నీటిలో స్నానము జేయదలంచిన వాడెట్లు శుద్ధినిబొందగలడు?

శ్లో॥ గంగాతోయేన సర్వేణ మృద్భారైః పర్వతోపమైః
ఆమృత్యోరాచరేచ్ఛౌచం భావదుష్టో న శుద్ధ్యతి.

తా॥ సమస్త గంగాతీర్థములలో పర్వతసమానమగు మట్టిచే తోముచు మరణపర్యంతము కడిగి శుద్ధముచేసిన వాడైనను భావశుద్ధిలేని మనుజు డెప్పటికిని శుద్ధుడుగాడు.

శ్లో॥ భావశుద్ధిః పరంశౌచం ప్రమాణం సర్వకర్మసు
చిత్తం విశోధయేత్తస్మాత్కిమన్యైర్బాహ్యశోధనైః॥

తా॥ ఆత్మశుద్ధికి సమానమైన శౌచముమరొకటిలేదు. సర్వకార్యములోను యిదియే ముఖ్యమగు ప్రమాణము. అందువల్ల బుద్ధిమంతుడైన వాడెల్లప్పుడును చిత్తశుద్ధిచేయుటలో ప్రయత్నపరుడై యుండవలయును. అట్లు చేయక బాహ్యకృత్యములు గలిగియుండిన యేమి ప్రయోజనము.

శ్లో॥ భావతస్సంవిశుద్ధాత్మా స్వర్గం మోక్షం చ విన్దతి॥
తా॥ భావశుద్ధిగలవాడు స్వర్గము మోక్షమున్ను పొందుచున్నాడు.

శ్లో॥ ఆచారహీనాన్న పునన్తి వేదాః యద్యప్యధీతాః సహషడ్భిరఙ్గైః
ఛందాంస్యేనమ్మృత్యుకాలేత్యజన్తంనీడంశకున్తా ఇవ జాతపక్షాః॥

తా॥ ఆచారహీనుని వేదములుగాని వేదాంగములుగాని పవిత్రునిగా జేయజాలవు. మరణ కాలమందు యీ వేదవేదాఙ్గములన్నియు వీనిని వీడిపోవును. యేలాగనగా పక్షములు వచ్చిన పక్షులు గూడును వదలి పోవునో ఆలాగున నుండును.

శ్లో॥ భావదుష్టోంభసిస్నాత్వా భస్మనా న చ శుద్ధ్యతి
భావశుద్ధశ్చరేచ్ఛౌచమన్యథా న సమాచరేత్॥

తా॥ మనోనిర్మలము లేనివాడు గంగాతీర్థములో స్నానమాచరించి దేహమంతయు భస్మముపూసికొన్నను శుద్ధుడుగాడు. భావశుద్ధిగలుగ తలంచుకొనువాడు దానికితగిన అనుష్ఠానముగలిగి యుండవలసినదే గాని వేరు ఏ మార్గమునాచరించగూడదు.

శ్లో॥ అంతశ్శుద్ధి విహీనైస్తు ఒధ్వరావివిధాకృతాః
న ఫలంతి మునిశ్రేష్ఠ భస్మవిన్యస్తహవ్యవత్॥

తా॥ ఆత్మశుద్ధిలేనివారిచేత యెన్నివిధములైన యజ్ఞాదిక్రతువులాచరింపబడినను, ఓ మునిశ్రేష్ఠా! అవన్నియు నిష్ఫలములు. యెట్లన అవి యన్నియు బూడిదయందుహోమించిన హవిస్సువలె వ్యర్థములు.

శ్లో॥ భావశుద్ధివిహీనానాం సమస్తం కర్మనిష్ఫలం
తస్మాద్రాగాదికం సర్వం పరిత్యజ్య సుఖీ భవేత్॥

తా॥ భావశుద్ధిలేనివాడు చేయు సమస్తకర్మలు నిష్ఫలములే, అందువల్ల రాగద్వేషాదులన్నిటినిత్యజించి సుఖవంతుడుగావలయును.

శ్లో॥ మృదాంభారసహస్రైస్తు కుంభకోటిజలైస్తథా
కృతశౌచోఽపి దుష్టాత్మా చండాలసదృశస్స్మృతః॥

తా॥ ఆత్మశుద్ధిలేనివాడు వేలకొలదిటన్నుల మట్టితోను కోట్లకొలది ఘట జలములచేత శౌచముచేసిన వాడైనను, శుద్ధాత్ముఁడు గానేరడు. వాడు పాపాత్ములతో సదృశుఁడు.

శ్లో॥ అంతశ్శుద్ధివిహీనశ్చ బహిశ్శుద్ధిం కరోతి యః
అలంకృతస్సురాభాండ ఇవ శాన్తిం న గచ్ఛతి॥

తా॥ అంతశ్శుద్ధిలేనివాడై బాహ్యశుద్ధియందు నిపుణుడైనవాడు అలంకరింపబడిన కల్లుకుండ యేలాగున శుద్ధినిపొందకుండునో వీనియొక్క స్థితియునట్టిదే. లోపలశుద్ధముగా గడిగినమాత్రముననగదా సురాభాండము శుద్ధమగును.

శ్లో॥ అనిర్జితేంద్రియగ్రామం యస్తు ధ్యానపరో భవేత్
మూఢాత్మానం చ తం విద్యాద్ధ్యానం చాస్య న సిద్ధ్యతి.

తా॥ ఇంద్రియ నిగ్రహమును గలుగ జేసికొనక యెవడైతే ధ్యానపరుడై యుండునో అట్టి వానిని మూఢుడనిగానే తెలిసికొన వలయును. అతనికి ధ్యానము సిద్ధించదు.

శ్లో॥ అనిష్కల్మషచిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్
నరస్యాఙ్గారకస్యేవ సదా క్షీరాభిషేచనమ్॥

తా॥ కల్మషమునశించని హృదయముగలవాడు సమస్తతీర్థములలో స్నానమాచరించినను శుద్ధుడు గాడు. అది యెటువంటిదన బొగ్గును తెలుపుచేయుటకు క్షీరమందెంతకడిగినను యెట్లు శుద్ధముగాదో ఆలాగున అతడును శుద్ధాత్ముడుగాజాలడు.

శ్లో॥ కర్మణా జాయతే భక్తిర్భక్త్యాజ్ఞానం ప్రజాయతే
జ్ఞానాత్ప్రజాయతే ముక్తిరితి శాస్త్రేషు నిశ్చయః॥

తా॥ సత్కర్మలచేత భక్తికలుగును. భక్తిచే జ్ఞానోదయమగును. జ్ఞానముచే ముక్తిసిద్ధించును. ఇదిసర్వశాస్త్రములయొక్క నిశ్చయము.

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

తా॥ అజ్ఞానమనెడు తిమిరవ్యాధిచే కన్నులుగనుపించని వానినేత్రములను జ్ఞానమనెడు కాటుక శలాకచేత యే యొక్క సద్గురు కరుణవల్ల తెలుపబడెనో అట్టి గురుదేవునకు నమస్కారము.

ఓమ్.

---

# 13 గురు పూజావిధానము.

శ్రీ దక్షిణామూర్తిని పూజచేయువారు సనకాది ఋషుల నలువుర సహాపూజించవలయును. శ్రీ శంకచార్యులవారిని పూజించువారుగూడ, తనముఖ్యశిష్యులగు నలువుర నెట్లుపూజింతురో, ఆలాగున శ్రీ వ్యాసపూజచేయువారు, జైమిన్యాది నలువుర శిష్యుల నెట్లుపూజింతురో, ఆలాగున సకలసాంప్రదాయులున్ను, వారిముఖ్యశిష్యులగు నలువురను పూజించవలయును. పటములుగాని విగ్రహములుగానియుండినచో మధ్యస్థానమున మూల మూర్తులను స్థాపించి, తక్కిన నాల్గుదిక్కులలో కలశముల స్థాపించి, తత్తన్నామధేయమూర్తుల నావాహనజేసి పూజించవలయును. అనగా యీశాన్యము, ఆగ్నేయము, నైరుతి, వాయవ్యయము అనునాలుగు దిశలలోను తత్తన్నామ కలశములను స్థాపించి పూజించవలయును. దక్షిణదేశమున ముఖ్యముగా నామదేవ ఋషిని పూజింతురు. శ్రీ దక్షిణామూర్తిని అన్ని దేశములయందును సమానముగా పూజింతురు. ఇది ఆ సాంప్రదాయమువారు గురుపూజకాలములో ఆరాధింతురు. శ్రీ శంకరజయంతియందును చాతుర్మాస్యమంపును శంకరులను కొందఱున్ను, వ్యాసులనుకొందరున్ను, వీరుభయులను కొం

దరుపూజింతురు. మాఘపౌర్ణమియందు శ్రీ వ్యాసపూజ ముఖ్యము. యిక వారివారి పారంపర్యానుగతముగ ఆయాపూజాకాలములలో వారి వారి సంప్రదాయపద్ధతి ననుసరించి గురుఆరాధన పూజాదులు సలుపుదురు. వారివారిమన్త్రములు వేరువేరుగానే యుండును. శ్రీ దక్షిణామూర్తిపూజలో శ్రీ దక్షిణామూర్తిని, అష్టోత్తరశతముతోగాని, సహస్రనామముతోగాని అర్చింతురు. ఆలాగుననే శ్రీ వ్యాసపూజ వ్యాసాష్టోత్తరశతముతోగాని, సహస్రనామముతోగాని పూజచేయుదురు. వ్యాసాష్టోత్తరశతము నిత్యప్రార్థనయందుగలదు. శ్రీ శంకరాచార్య అష్టోత్తరశతనామావళి శంకరవిజయమునగలదు. అదిదొరకినచో, గుర్వష్టోత్తరశతముతో పూజింపవచ్చును. ఇది శ్రీ వెంకటేశ్వరపూజాపంచరత్నమాలయందు గలదు. తక్కిన పూజామంత్రములన్నియు, వారివారి సాంప్రదాయములో యుండును.

(1) శ్రీ దక్షిణామూర్తిపూజ.

పై చెప్పిప్రకారము పూజామండపమధ్య ప్రదేశమున శ్రీదక్షిణామూర్తి విగ్రహముగాని కలశముగాని స్థాపించి ఆగ్నేయము, నైరుతి, వాయవ్య,ఈశాన్య, దిశలలో సనకసనందన సనాతనసనత్కుమారులను నలుగుర ఋషుల నామధేయములతో కలశములస్థాపించి పూజించవలయును.

శ్లో॥ సనకస్సనాతనశ్చైవ ప్రభుర్యశ్చ సనన్దనః
విభుస్సనత్కుమారశ్చ నిర్మలో నిరహంకృతిః.
శ్లో॥ సనకశ్చ సనన్దశ్చ సనాతన మునిస్తతః
సనత్సుజాత ఇత్యేతే యోగివర్యాశ్శివప్రియాః.

తా॥ (1) సనకుడు (2) సనాతనుడు (3) సనన్దనుడు (4) సనత్కుమారుడు వీరు ప్రభువులుగాను, నిర్మలులుగాను, నిరహంకృతులుగాను యుంటున్నారు, అని పై శ్లోకమున కర్థము. రెండవశ్లోకమున సనత్కుమార స్థానములో సనత్సుజాత యనిగలదు. వీరునలువురును మహాయోగివర్యులును, ఈశ్వరప్రియులుగాను యుంటున్నారు. సనత్కుమారుల వారికే సనత్సుజాతులని నామాన్తరముగలదు. కావున వీరుభయులును నొకరేగానే వేరువేరుగాదని, గ్రహించవలయును.

### (2) శ్రీ వ్యాసపూజ.

పైచెప్పినప్రకారము పూజామండపము నిర్మించి, మధ్య వ్యాస ప్రతిష్ఠయొనర్చి నాలుగుదిశలలో (1) వైశంపాయన (2) పైల (3) జైమిని (4) సుమన్తు యీనలువురఋషులను కలశములతో నావాహనజేసి పూజించవలయును.

శ్లో॥ వైశంపాయనఏవస్యాత్పైలో జైమినిరేవచ
సుమన్తుశ్చేతి చత్వారో వ్యాస శిష్యా మహౌజసః.

తా॥ (1) వైశంపాయనముని (2) పైలముని (3) జైమినిముని (4) సుమన్తుముని వీరు నలువురు వ్యాసశిష్యులు, మహాతేజోవంతులు.

శ్లో॥ ఋగ్వేదపారకం పైలం జగ్రాహ స మహామునిః
వైశంపాయన నామానం యజుర్వేదస్యచాగ్రహీత్.

శ్లో॥ జైమినిం సామవేదస్య తథైవాథర్వవేదవిత్
సుమన్తుస్తస్య శిష్యోఽభూత్ వేదవ్యాసస్య ధీమతః.

శ్లో॥ రోమహర్షణనామానం మహాబుద్ధిం మహామునిః
సూతం జగ్రాహ శిష్యం స ఇతిహాసపురాణయోః.

తా॥ వేదవ్యాస మహాముని పైలమునికి ఋగ్వేదమును, వైశంపాయనమునికి యజుర్వేదమును, జైమినిమునికి సామవేదమున్ను, సుమన్తుమునికి అథర్వవేదమును అధ్యయనముజేయించి యీ నాలుగు వేదములకు యీ నలువురను ప్రవర్తకులుగ చేసెను. రోమహర్షమహాముని పుత్రుఁడగు సూతమహర్షికి యితిహాసపురాణముల నుపదేశించెను. కావుననే నైమిశారణ్యమునందు, అష్టాదశపురాణములును, సూతమహర్షి శౌనకాదిమహామునులకుపదేశించుటకు కారణమైనది. పైజెప్పిన నలువురును మహర్షులును, సూతమునియు, తామభ్యసించిన విద్యలను వేద యితిహాస పురాణములను, అనేకశాఖలుగాచేసి వారివారి శిష్యప్రశిష్యులకుపదేశించి ప్రపంచమంతయు జ్ఞానమార్గమును వ్యాపింపజేసిరి.

### (3) వామదేవపూజ.

ఇదియు పైజెప్పిన ప్రకారము స్థాపనములు చేసి (1) అగస్త్య, (2) పులస్త్య, (3) పులహ, (4) క్రతు, అను నలుగురు ఋషులను నాలుగు దిక్కులలో స్థాపించి పూజించవలయును.

శ్లో॥ అగస్త్యశ్చ పులస్త్యశ్చ పులహః క్రతురేవచ
తవ శిష్యా మహాత్మానో వామదేవ మహామునే.

తా॥ పై జెప్పిన అగస్త్యముని, పులస్త్యముని, పులహముని, క్రతుముని, వీరునలువురున్ను మహాత్ములు, వామదేవమహామునియొక్క శిష్యులు.

(4) శంకరాచార్య పూజ.

శ్రీ శంకరాచార్యులవారి పూజ పై జెప్పిన ప్రకారముగా పూజామండపము నిర్మించి మధ్యభాగమున శ్రీ శంకరాచార్యులవారిని స్థాపించి తక్కిన నాలుగు దిక్కులలో పద్మపాదులు, హస్తామలకుడు, త్రోటకులు, సురేశ్వరులు, అను నలువురాచార్యులను స్థాపించిపూజించవలయును.

శ్లో॥ ఓం నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ
వ్యాసంశుకం గౌడపదం మహాన్తం గోవిన్ద యోగీంద్ర మథాస్య శిష్యం
శ్లో॥ శ్రీశంకరాచార్యమథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యం
తంత్రోటకం వార్తికకారమన్యా నస్మద్గురూన్ సంతతమానతోఽస్మి.

(దీని అర్థము సువిదితము)

ఇట్టి ఆత్మజ్ఞాన సంపన్నులగు గురువరేణ్యులును వెతకి తరింపకోల్లక శాస్త్రములు చదివిగాని, దేవతలను ఉపాసనచేసిగాని, లేక తపస్సులవల్ల, యిష్టదేవతా ప్రత్యక్షమును చేసుకొనతలంచు వారినిగురించి చెప్పెడు శాస్త్రవాక్యములను క్రింద నిరూపించెద. యీగ్రంథమునకు కారణభూతుడగు గురుభక్తుడు గురుభక్తి ప్రభావమువల్లనే ప్రతిబంధవములన్నియు తొలగినవాడై ఆత్మప్రబోధము గలిగి పరమ నిర్వాణమగు బ్రహ్మమును యీదేహముతోగూడిచటయుండు నప్పుడే పొందుటకు కారణమయ్యెను.

శ్లో॥ గుకారోసిద్ధసంజ్ఞస్స్యాద్రేఫః పాపస్య దాహకః
ఉకారోవిష్ణురవ్యక్తస్త్రితయాత్మా గురుర్భవేత్.

తా॥ గుకారము సిద్ధుల పేరగును. రేఫము (అనగా రకారము) పాపసంఘమును దహింపజేయునదగును. ఉకారము అవ్యక్తమైనవిష్ణుస్వరూపము, యీమూడున్ను చేరినదే గురుస్వరూపమగును.

వి॥ అనగా గురువను శబ్దమందు గు, ర, ఉ, అనుమూడుక్షరములు గలవు. రకారమునకు ఉకారము చేరుటవలన, రు,అనిశబ్దమేర్పడుచున్నది. కావున జ్ఞానశుద్ధియు పాపదహనము విష్ణుస్వరూపము గలిసి 'గురు' అను శబ్దమేర్పడు చున్నది.

శ్లో॥ గణేశా వాగ్నినాయుక్తో విష్ణునా చ సమన్వితః
వర్ణద్వయాత్మకో మంత్రశ్చతుర్ముక్తి ప్రదాయకః.

తా॥ గణేశ బీజమగు 'గ' కారము అగ్ని బీజమగు రకారముతో గూడినదై విష్ణుస్వరూపమగు ఉ, కారముతోనుచేరి, గురు, అనురెండక్షరములతోగూడిన మంత్రమై అనుష్ఠాన తారతమ్యము ననుసరించి సాలోక, సామీప్య, సారూప్య, సాయుజ్యాది చతుర్విధమోక్షములను గలుగచేయునదిగాయుంటున్నది. వి=లేక ధర్మ, అర్థ, కామ, మోక్షము, లనెడు పురుషార్థచతుష్టయము నొసంగునదిగాయుంటున్నది. 'గ' గకారమనునది విఘ్నేశ్వరబీజాక్షరము 'ర' ర అనునది, అగ్నిబీజము 'ఉ' ఉ అనునది విష్ణుబీజము. కావున యీమూడు బీజాక్షరముల యొక్క సంపుటమే 'గురు' అను మంత్రమగుచున్నది.

శ్లో॥ యదా మమ శివస్యాపి బ్రహ్మణో బ్రాహ్మణస్యహి.
అనుగ్రహో భవేన్నౄణాం సేవ్యతే సద్గురుస్తదా.

తా॥ యెప్పుడైతే విష్ణువైన నాయొక్కయు, శివునియొక్కయు, బ్రహ్మయొక్కయు, బ్రహ్మజ్ఞానియైన బ్రాహ్మణునియొక్కయు, యనుగ్రహము నరునకు లభించునో, అప్పుడే సద్గురు సేవలభించును. అనగా సద్గురుకరుణకు పాత్రుడు గాగలడు.

వి॥ శ్రీ విష్ణుభగవానునియొక్కయు, పరమశివునియొక్కయు, బ్రహ్మదేవునియొక్కయు,బ్రహ్మనిష్ఠులగు మహాత్ములయొక్కయు, కరుణగలుగునపుడే శ్రీ సద్గురు కరుణ (అనగా సద్గురూపదేశము) లభించును. సద్గురు సేవయున్ను సిద్ధించును.

శ్లో॥ హరౌ ప్రసన్నేపి చ వైష్ణవా జనాః సంప్రార్థయన్తో గురు
భక్తి మవ్యయాం,
గురౌ ప్రసన్నే జగదీశ్వర స్సదా జనార్దనుష్యతి సర్వసిద్ధిదః.

తా॥ భగవంతుఁడగు శ్రీమన్నారాయణమూర్తి ప్రసన్నుఁడైనను విష్ణుభక్తులు అక్షయమైన గురుభక్తినే గోరుచుందురు. గురువుప్రసన్నుఁడాయెనేని జగదీశ్వరుఁడగు శ్రీవిష్ణుమూర్తి యెల్లప్పుడు సర్వసిద్ధుల నొసగి, పరమానంద భరితుఁడుగు చుండును. ఇందువల్ల గురుభక్తియే సంపూర్ణమైన ఫలమును గలుగజేయునదిగా యేర్పడుచున్నది.

శ్లో॥ గురుస్సదాదర్శయితా ప్రవృత్తిం తీర్థవ్రతం యోగతపోదిధర్మాన్
ఆచారవర్ణాదివివేకయజ్ఞాన్ జ్ఞానం పరం భక్తివివేకయుక్తమ్.

తా॥ శ్రీగురుమూర్తి ప్రవృత్తిని, తీర్థమును, వ్రతమును, యోగమును, తపస్సుగాగల ధర్మములను, ఆచారము, వర్ణము మొదలుగాగల జ్ఞానముతో గూడిన యజ్ఞములను భక్తి వివేకముతోను గూడుకొన్నటువంటి శ్రేష్ఠమగు జ్ఞానము మొదలగువాటిని యెల్లప్పుడు చూపించువాడుగాయున్నాడు.

శ్లో॥ గురోర్వినా న శ్రవణం భవేత్కస్యాపి కస్యచిత్
వినా కర్ణేన శాస్త్రస్య శ్రవణం తత్కుతో భవేత్॥

తా॥ చెవిటివానికి శాస్త్రశ్రవణము అనునది యెటులగలుగును ఆలాగున యెవనికైతే గురువు ఉండడో వానికి వేదాంతార్థ శ్రవణ మెట్లు సిద్ధించును.

శ్లో॥ న తీర్థయాత్రా నచ దేవయాత్రా నదేహయాత్రా నచగేహయాత్రా
అహర్నిశం బ్రహ్మహరిః సుబుద్ధో గురుః ప్రసేవ్యోనహిసేవ్యమన్యత్॥

తా॥ సాధారణ జనులు రాత్రిం బవళ్లు అప్రధానమైన తీర్థయాత్రయు దేవతాయాత్రయు, దేహయాత్రయు, కుటుంబయాత్రయు, శ్రద్ధతో సేవించుదురేగాని బ్రహ్మమున్ను, హరియును, ప్రబుద్ధుడైన గురుడేయని తెలిసికొని సేవించుటలేదు. అనిత్యములైన పై చెప్పిన యాత్రలన్నియు ముఖ్యములుగావు.

శ్లో॥ యత్ర యత్ర దృఢా భక్తిర్యదాకస్య మహాత్మనః
తత్ర తత్ర మహాదేవః ప్రకాశముపగచ్ఛతి॥

తా॥ ఎచ్చటెచ్చట యే బుద్ధిమంతునికి దృఢమైన గురుభక్తి యెప్పుడుగలుగునో అచ్చటచ్చట అప్పుడే పరమేశ్వరుండావిర్భవించును.

యేలనన గురుభ క్తిగలవాడు సాక్షాచ్ఛివ స్వరూపుడేయగును.

శ్లో॥ చక్షుర్గమ్యం గురుంత్యక్త్వా శాస్త్రగమ్యంతు యస్స్మరేత్
హ స్తస్థముదకం త్యక్త్వా ఘనస్థ మభివాంఛతి.।

తా॥ దృష్టికి సాక్షాత్తుగా గనుపించెడు గురుదేవునిత్యజించి నేత్రమున కగోచారమగు శాస్త్రమునుచదివి జ్ఞానమును సంపాదింప తలంచువాడు చేతిలోగల జలమునుత్యజించి మేఘములోగల జలమును పానము చేయుటకు యత్నించువానివలె యుండును.

శ్లో॥ సులభంతు గురుంత్యక్త్వా దుర్లభంయ ఉపాసతే
లబ్ధంత్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేష తే క్షితౌ॥

తా॥ సులభముగా కన్నులార గానబడు గురుదేవుని ఉపేక్షించి దుర్లభమైన దేవతోపాసనగాని, శాస్త్రమునందలి నిగూఢజ్ఞానమునుగాని పొందతలంచు వాడు తనకు లభించిన ధనమును వదలి పెట్టి, భూమిలో మెచ్చటనో నిక్షేపము గలదని తలంచి, త్రవ్వువానివలె మూఢుడగును.

శ్లో॥ మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళమ్॥

ఓమ్.

---

# 14. పరాపూజా విధానము.

ఈ పరాపూజా విధానము శ్రీ శంకరాచార్య స్వాములవారిచే వ్రాయబడినది. మన యీ గ్రంథమునకు కథానాయకుడగు పరమ గురు భక్తుడు తనగురుదేవుని, యేప్రకారము భావించినను స్తోత్రముజేయజాలక మౌనముద్రను ధరించెనో, ఆ మహాత్ముడు మనోవాగింద్రియముల కతీతమై స్వయంప్రకాశమై, అనంతమై, అఖండమైయుండు బ్రహ్మాకార స్థితినిపొందెనో, అదే శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారి యనుభవము గూడ, ఇదే అఖండమగు పూర్ణమగు బ్రహ్మాకారానుభవమని ముముక్షువులు తెలిసికొన వలయును. యిట్టిస్థితి గలుగు వఱకు తన ప్రయత్నము పూర్తియైనదని తలంచ గూడదు. కారణ రూపమగు వృక్షమునుండి యేర్పడిన కార్యరూపములగు బీజములన్నియు మరల తమకు కారణము

లగు వృక్షాకారస్థితిని పొందుచుండునో, ఆలాగున మహాకారణుఁడగు పరమేశ్వరునినుండి యేర్పడిన జీవకోట్లన్నియు ఆ పూర్ణమగు బ్రహ్మత్వము పొందవలయును. దానికిశుద్ధమైన భూమియుఁ శుద్ధమైనజలము నిరావరణ మగు సూర్యకిరణము శుద్ధమగువాయువున్ను, ఆకాశమున్ను యెట్లవసర ములో, జీవునికిఁగూడ ఆలాగున శుద్ధమైన హృదయమున్ను శుద్ధమైన ఆహారమున్ను, శుద్ధమైనబ్రహ్మనిష్ఠయున్ను, శుద్ధమైన సంకల్పమున్ను, శుద్ధ బ్రహ్మభావనయు గలుగవలయును. అట్లు అన్నియు యేర్పడినను పంచ భూతములు శుద్ధములుగా యేర్పడినను బీజము తనకారణ రూపమగు మహావృక్షమునకు యేలాగున కొన్ని సంవత్సరములుపట్టునో, పై చెప్పిన పంచశీలము లేర్పడినను కొంతకాలము బ్రహ్మనిష్ఠ యెడతెగకనే చేయు చుండవలయును. అట్లైనమాత్రమే జీవత్వరాహిత్యము బ్రహ్మత్వ ప్రాప్తియు జీవులకు గలుగును.

శ్లో॥ దేహాదజ్ఞానతః కార్యాత్కా- రణాచ్చాపియ ముత్తమః
జీవత్వహానాద్బ్రహ్మత్వ భావాచ్చోత్త మతోచితా॥

తా॥ దేహముకంటెను అజ్ఞానముకంటెను అజ్ఞానకార్యము కంటెను కారణముకంటెనుకూడ నితఁడు త్తమోత్తముడని తగియున్నది.

పరాపూజ. శ్లో॥ ఓమ్. పూర్ణస్యావాహనంకుత్ర సర్వాధారస్యచాసనమ్
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ శుద్ధస్యాచమనం కుతః

తా॥ పరిపూర్ణమైన పరబ్రహ్మమునకు ఆవాహనమెచ్చట. సర్వము నకు ఆధారమైన పరమాత్మకు ఆసనమెచ్చట. పరిశుద్ధమైన బ్రహ్మమునకు అర్ఘ్యపాద్యాదులెక్కడివి. శుద్ధమగుపరబ్రహ్మమునకు ఆచమనమెచట.

వి = అంతటనిండిన వస్తువునకు ఒకస్థలమునుండి మఱియొక స్థల మున యెట్లు ఆవాహనముసిద్ధించును. ఒకప్రదేశములో యుండు దేవుని మరియొక ప్రదేశములోనికి ఆవాహనము చేయవచ్చును. సర్వమున కాధారభూతుఁడగు బ్రహ్మమునకు మఱొకపీఠమును యెట్లు నిర్ణయించ వచ్చును. తక్కినవన్నియు యీలాగున ఆలోచించుకొనతగినది.

శ్లో॥ నిర్మలస్య కుతస్స్నానం వస్త్రం విశ్వోదరస్యచ
నిరాలమ్బస్యోపవీతం పుష్పం నిర్వాసనస్యచ॥

తా॥ నిర్మలమైన బ్రహ్మమునకు స్నానమెచ్చట విశ్వమే యుదరముగా గల పరమాత్మకు వస్త్రధారణ మెట్లుచేయదగును. దేనితోను ఆలమ్బనము లేని బ్రహ్మమునకు యజ్ఞోపవీతమెచ్చట ధరింపనగును వాసనారహిత మగు బ్రహ్మమునకు పుష్పము లెక్కడివి.

వి॥ మాలిన్యముగలవాడైన, స్నానముచే శుద్ధపడును. పర బ్రహ్మము, యెల్లప్పుడు ప్రకృతి దోషరహితమగు నిర్మలజ్ఞాన స్వరూప మగుటచే స్నానమెట్లుసంభవించును. తక్కినవన్నియు యీలాగుననే, యోచించు కొనదగినవి.

శ్లో॥ నిర్లేపస్య కుతో గన్ధో రమ్యస్యాభరణం కుతః
నిత్యతృప్తస్య నైవేద్యం తాంబూలంచ కుతో విభోః.

తా॥ నిర్లిప్తుడగు పరబ్రహ్మమునకు గంధమెట్లుధరింపగలను. రమ ణీయమగు పరమాత్మకు, ఆభరణమెచట. సర్వదాతృప్తుడైన, పరమా త్మకు నైవేద్య సమర్పణలెట్లుపొసగును. విభుస్వరూపుడగు సర్వేశ్వ రునకు తాంబూలమెట్లు సమర్పించనగును.

వి॥ ఆకాశమువలె నిర్లిప్తుడగు పరమాత్మకు, యెట్లు గంధ సమర్పణ చేయగలను. తక్కిన పదములకుగూడ యీలాగున అర్థముచేసికొనేది.

శ్లో। ప్రదక్షిణాహ్యనంతస్య హ్యద్వయస్య కుతోనతిః
వేదవాక్యైరవేద్యస్య కుతస్తోత్రం విధీయతే.

తా॥ అనంతుడగు బ్రహ్మమునకెట్లు ప్రదక్షిణచేయగలను. అద్వయు డనగా, రెండవవాడులేని బ్రహ్మమునకెట్లు నమస్కారములు చేయగ లను. వేదవాక్యముల కతీతుడగు బ్రహ్మమునుయెట్లు స్తోత్రముచేయగ లను.

వి॥ ప్రదక్షిణము చేయవలసియుండిన ఒక ప్రదేశమునందు మూర్తి యుండవలయు, అట్లుగాక అనంతుడై, సర్వవ్యాపకుడై యుండు బ్రహ్మ మున కేలాగున ప్రదక్షిణము చేయుగలము. జీవుడువేరుగాను, ఈశ్వ రుడు వేరుగానుండిన నమస్కారముపొసగును. జీవేశ్వరులిద్దరును నొక్కరై యుండగా యేలాగున, నమస్కారము సిద్ధించును. యీలా గున యితరపదములకు కూడ జ్ఞాపకముచేసికొనవలయును.

## గురుభక్తి ప్రభావము.

శ్లో॥ స్వయంప్రకాశ మానస్య కుతో నీరాజనం విభః.
అన్తర్బహిశ్చ పూర్ణస్య కథముద్వాసనం భవేత్.

తా॥ స్వయం ప్రకాశమానమగు పరబ్రహ్మమునకెట్లు నీ రాజనము సిద్ధించు విభుస్వరూపుడును, బాహ్యాభ్యన్తరములంతట నిండి నిబిడమై యుండు బ్రహ్మమునకు ఉద్వాసన మెట్లుసంభవించును.

వి॥ ప్రకాశములేని ఒకవిగ్రహమును ప్రకాశింపచేయుట కొఱకు, కర్పూరహారతి తగును. సమస్తమును ప్రకాశింపచేయునదై, స్వయం ప్రకాశమైయుండు బ్రహ్మమును ప్రకాశింపజేయుటకు మరొకటి గావల యునా, యితర వాక్యములనుగూడ యీలాగున గ్రహించుకొనేది.

శ్లో॥ ఏవమేవ పరాపూజా సర్వావస్థాసు సర్వదా
ఏకబుద్ధ్యా తు దేవేశే విధేయా బ్రహ్మవిత్తమైః.

తా॥ యీ ప్రకారము పరాపూజను సర్వకాల సర్వావస్థలయందును, ఏక మనస్కులై బ్రహ్మజ్ఞానులు చేయవలయును. ఓమ్.

విశేషార్థము. "విధేయాబ్రహ్మవిత్తమైః" అని ప్రయోగించుట వల్ల బ్రహ్మవేత్తలగు వారికిమాత్రమేయిట్టి భావముయొక్క అనుభవము గలుగును. గాని తక్కినవారికి గలుగనేరదని అర్థమగుచున్నది. అయితే ఒకవిద్య సంపూర్ణమగునపుడు, మొదటనుండి కడవరకు చెప్పవలసిన ధర్మమెట్టిదో, ఆలాగున జీవకోట్ల తరగతిననుసరించి చెప్పాచు, కట్ట కడకుచెప్పవలసిన, పరమావస్థయు తెలుపుట ధర్మమగుటవల్ల, యీలా గున యిచ్చట తెలుపుటధర్మమైనది. అయితే, శాస్త్రములో ఒకపరమ రహస్యముగలదు. అదేమన తనకులేనిమహిమను, చెప్పం బూనిన గలిగి యుండు మహిమ యంతర్ధానమగుటయేగాక, రాగల మహిమగూడ రాకనేపోవును. యీసత్యవాక్యమును బాగుగా జ్ఞాపకముచేసికొని, తన అవస్థననుసరించి అన్ని కార్యములు చేసికొనుచుండవలయును. అట్లుగాక ప్రవర్తించెనేని ఆకలితో మలమలమాడువాడు, తానుతృప్తిగా భుజించిన వాడనని చెప్పాచుండినయెట్లుండునో, ఆలాగున రోగబాధచే తీవ్రముగా తపించువాడు, ఆరోగ్యవంతునివలె నటించిన యెట్లుండునో, అట్టిగతియే గలుగునని ముముక్షులెవ్వరున్ను మఱువగూడదు. మఱియు నిరుద్యోగి యగువాడు, గొప్ప ఉద్యోవలె డ్రస్సులుధరించి ప్రవర్తించుచుండిన,

యెప్పుడైనను పట్టుపడి ప్రభుత్వముచే శిక్షింపబడునో, యిదిన్ని అలాటిదని జ్ఞాపకముచేసికొని ప్రవర్తించువారు ధన్యాత్ములగుదురు. అట్లుగాక ప్రతిదినమును చదువవలసినపాఠమును చదువకనే, బాగుగా చదివినవానివలె నటనముచేసిన దానియొక్క ఫలితము పరీక్షకాలమున తేలునుగదా, దీనికన్న యెక్కువ యీ విషయమై చెప్పదలంచలేదు.

శ్లో॥ న కాల నియమో యత్ర న దేశస్య స్థలస్యచ
యత్రాస్య రమతే చిత్తం తత్ర ధ్యానేన కేవలమ్.

తా॥ పై జెప్పినవిధముగా ధ్యానముచేయువానికి ప్రాతస్సంధ్యాది కాలనియమముగాని పుణ్యదేశశుద్ధస్థల విచారముగాని యవసరములేదు. ఎచ్చోట యెప్పుడెప్పుడు తనమనస్సు యాత్మబ్రహ్మయందు రమించునేని, అచ్చట కేవల పరధ్యానము చేయుచుండవచ్చును.

శ్లో॥ స ఆత్మాసచ విజ్ఞేయ స్సర్వైరపి ముముక్షుభిః
తుర్యాత్మ జ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్క దాచన.

తా॥ ముముక్షువులందరిచేతను, యనంతమగు ఆత్మయే తెలిసికొనదగినది, పొందతగినది, యట్టితురీయాత్మ జ్ఞానములేనివారికి యెప్పటికిని మోక్షములేదు

శ్లో॥ సంసారార్ణవమగ్నానాం జంతూనామవివేకినాం
అగతీనాం గతిః సాక్షాత్ జ్ఞానమేవ హి కేవలమ్.

తా॥ సంసారమను సాగరములో మునిగినవారికిన్ని- ఆత్మానాత్మ వివేక జ్ఞానములేనివారికిన్ని, యే సహాయము లేనివారికిన్ని, సాక్షాదాత్మ జ్ఞానమొక్కటియే సహాయపడును. వేరుసద్గతి మార్గములేదు.

శ్లో॥ సంసారదుఃఖ తప్తానామాత్మ జ్ఞానామృతాంబుసా
తాపశాన్తి ర్నచాన్యేన సత్యమేవ నసంశయః.

తా॥ సంసారతాపత్రయముచే తపించెడి జీవకోట్లకు ఆత్మజ్ఞానామృత జలముచేతనే తాపత్రయశమనము గలుగునుగాని, వేరు శమనమార్గము లేదు. యిదిసత్యము, దీనియందు సందేహమేలేదు.

శ్లో॥ ఆత్మాక్షేత్రజ్ఞసంజ్ఞోయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః
తైరేవ విగతశ్శుద్ధః పరమాత్మేత్యుదాహృతః.

తా॥ జీవుడనియు, క్షేత్రజ్ఞుఁడనియు, ప్రకృతి గుణములతో గూడి నపుడు పై జెప్పిన పేరు గలుగుచున్నది. పై జెప్పిన ప్రాకృతగుణములగు సత్త్వ, రజస్తమో గుణములనుండి విముక్తుడై నపుడీ యాత్మయే పరమాత్మయని తెలియబడుచున్నది.

శ్లో॥ యావ దాత్మా న లబ్ధోయం శుద్ధం జ్ఞానం చనోదితమ్
మలీనవిషయేరాగ స్తావదజ్ఞానమేవచ.

శ్లో॥ శ్రద్ధావినయ సంయుక్త శ్శాంతి దాంత్యాది సంయతః
యావత్ జ్ఞానోదయ స్తావద్వేదాన్తార్థం నిరూపయేత్.

తా॥ యెంతకాలమువఱకు ఆత్మ జ్ఞానోదయము కాలేదో, అంత వరకు శ్రద్ధ, వినయము మొదలగు వానితోను శాన్తి దాంత్యాదులతో కూడినవాడై వేదాన్తార్థమును విచారణచేయవలయును. ఓమ్

ఓమ్.

---

# 15. శాస్త్ర రహస్యము.

శ్లో॥ సమాధిమథ కర్మాణి మాకరోతు కరోతు వా.
హృదయేనాస్తి సర్వాస్థా ముక్త ఏవోత్త మాశయః.

తా॥ ఏ జీవన్ముక్తుని హృదయమందు సర్వవాసనలు నశించిపోయి యున్నవో, అట్టి మహాత్ముడు యెల్లప్పుడు సమాధియందే యుండినను యుండుగాక, లేకప్రాణికోట్లకు హితమగు కర్మలను చేయుచుండినను, చేయుగాక. అట్టిమహాశయుడు యెల్లప్పుడును జీవన్ముక్తుడే, సంశయింప బనిలేదు.

శ్లో॥ నివృత్తి రపిమూఢస్య ప్రవృత్తి రుపజాయతే.
ప్రవృత్తి రపిధీరస్య నివృత్తి ఫలభాగ్భవేత్.

తా॥ మూఢబుద్ధి గలవానికి యే కర్మయు చేయకుండెడి స్థితి ప్రవృత్తినేకలుగ జేసినదగును. యేలనన దేహేంద్రియములతో యాతడు కర్మలజేయకపోయినను మనస్సులో సంకల్పములు నశించకుండుటచేతను, జ్ఞానాగ్నియందు సంస్కారములు భస్మముగాక పోవుటచేతను, నిస్సం

కల్పస్థితి గలుగదు. యే జీవన్ముక్తిని హృదయందు సమస్త వాసనలు నశించినవో, అతడు ప్రాణికోట్లకు చితములగు కర్మలచేయుచున్నప్పటికి హృదయశుద్ధి గలిగియుండుటచే ముక్తుడే.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణిచ కర్మయః
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్.

తా॥ యెవడు కర్మయందు అకర్మను జూచుచున్నాడో, యెవడకర్మయందు కర్మను జూచుచున్నాడో, వాడు మానవుల యందు బుద్ధిమంతుడు. వాడే యోగియు, సర్వకర్మల నాచరించిన వాడుగను, అగుచున్నాడు.

శ్లో॥ సాంఖ్యయోగౌపృథగ్బాలాః ప్రవదన్తి నపండితాః
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విందతే ఫలమ్.

తా॥ ఆత్మజ్ఞానము లేనివారు సర్వకర్మ సన్న్యాసమును లేక నిష్కామకర్మయోగానుష్ఠానమును వేరువేరుగాచెప్పుదురు. యిట్టివారు బాలురవంటివారు జ్ఞానులట్లు చెప్పరు. ఆ కర్మసన్న్యాస కర్మానుష్ఠానయోగముల రెండింటిలో ఒకదానినైనను చక్కగా ఆచరించినవాడు జ్ఞాన ఫలమును పొందుచున్నాడు.

వి॥ అవిరెండున్ను ఒకకొండురోడ్డు కిరుప్రక్కలనుండి ప్రయాణముచేసినవారివలె యుండును. ఉభయుల గమ్యస్థానము ఒకటియై యుండును.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం తద్యోగైరపిగమ్యతే.
ఏకంసాంఖ్యంచ యోగంచ యఃపశ్యతి స పశ్యతి.

తా॥ జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచేత పునరావృత్తి రహితమైన ఏ మోక్షము పొందబడుచున్నదో, అట్టిమోక్షము నిష్కామకర్మయోగులచేతగూడ పొందబడుచున్నది. కావున యేపురుషుడు (1) సాంఖ్యయోగము (2) నిష్కామకర్మయోగమును రెండున్ను ఒక్కఫలమునకే కారణమగుచున్నవని తెలిసికొనుచున్నాడో, అట్టివాడే పరమార్థ సారమును తెలిసినవాడగును

వి॥ దీనియందు "యః పశ్యతి సపశ్యతి" అనియుండుటచే సన్న్యాస యోగముయొక్కయు, నిష్కామకర్మయోగముయొక్కయు,

గమ్యస్థానమెుకటేయని తెలిసికొన్నవాడే శాస్త్రములోగల రహస్య మును తెలియుటకు గల జ్ఞానదృష్టి గలవాడనియు, అట్లుగానివాడు, శాస్త్రనిగూఢ సత్యమును జూచుటకు తగిన జ్ఞానదృష్టిలేని వాడనియు, గ్రహించు కొనవలయును.

శ్లో॥ శివమన్త్ర జపోధ్యానం హోమోయజ్ఞస్తపః శ్రుతమ్.
దానమధ్యయనం సర్వే భావార్థంనాత్ర సంశయః

తా॥ మన్త్రజపము, ధ్యానము, హోమము, యజ్ఞము, తపస్సు, వేదాన్తశ్రవణము, దానము, అధ్యయనము, మొదలుగాగల వన్నియు, భావశుద్ధికొఱకు, అనగా హృదయ నిర్మలత్వము కొఱకేర్పడినవి.

శ్లో॥ భావహీనో నరస్సర్వం కృత్వాపి న విముచ్యతే
భావయుక్తః పునస్సర్వ మకృత్వాపి విముచ్యతే.

తా॥ ఆత్మశుద్ధిలేనివాడు పైజెప్పిన జపాదికార్యము లన్నియాచరిం చినను శుద్ధాత్ముడుగాజాలడు. హృదయశుద్ధి గలవాడును, నిర్మలదైవ భావముగలవాడును, పైజెప్పిన జపాది కార్యములేవియు చేయకపోయి నను ముక్తుడేయగును.

శ్లో॥ శివపూజారతోవాపి విష్ణుపూజారతోథవా
గురుతత్వ విహీనశ్చేత్తత్సర్వం వ్యర్థమేవహి.

తా॥ శివపూజయందు నిరతుడైనను లేక విష్ణుపూజాధురీణుడైనను గురుకృపకు పాత్రుడుగానిచో, పైజెప్పినవన్నియు, నిష్ఫలములు.

ఓమ్

---

# 16. శ్రీ శివాజియొక్క భక్తి ప్రభావము.

శ్రీ శివాజీ చక్రవర్తి శ్రీ సమర్థ రామదాసస్వామి యాంత రంగిక శిష్యుడు. తనయొక్క గురుభక్తి యెటువంటిదో క్రింద నిరూపింప బడు విషయమువల్ల జనులు తెలిసికొనగలరు. యీ శ్రీ సమర్థరామ దాసుగారువ్రాసిన దాసబోధయను గ్రంధమును ప్రతిభక్తుడును జదువ దగినది. అది వచన రూపముగానుండుటచే సులభముగా నందఱకు అర్థముగాగలదు.

ఒకానొక దినమున సమర్థుఁడు మాహాళ్లీ సంఘమునందు స్నాన సంధ్యల నొనరించి, భిక్షనడుగుచు సితారాలోని శివాజీ భవనములోని కరిగెను. "జయరఘువీరసమర్థ జయరఘువీరసమర్థ" అని గర్జించి భిక్ష నడిగెను సమర్థుని వాక్కును వినగనే శివాజీ హృదయము గద్గదిక మయ్యెను. సత్పాత్రుఁడగు సద్గురునిజోలెయందు యేమి భిక్షము నిడవల యునాయని శివాజీయోచించి తక్షణమే యొకకాగితముమీఁద "శ్రీసమర్థుని చరణకమలములయందు నారాజ్యమంతయును సమర్పించితిని" అని వ్రాసి యాలేఖనమున, తనముద్రవేసి సంతకముజేసి వెలుపలికివచ్చి యా కాగితమును సమర్థుని జోలెయందుంచి సాష్టాంగదండము నర్పించెను. యీ యుదంతమునుగాంచి సమర్థుడిట్లు ప్రశ్నించెను. "ఏమీ శివబా! యెట్టి బిక్షమొసంగితివి? పిడికెడు బియ్యమును నాజోలెలో వైచినచో యీ రెండు జాములవేళ గడచి పోయెడిది గదా? నేడు కాగితపు ముక్కను సమర్పించియే నాకాతిథ్యము నొనర్చెదవా యేమి?" ఇట్లు నుడివి సమర్థుఁడు జోలెనుండి కాగితముతీసి చదువగా శివాజీ రాజ్యము నంతయు దనకుసమర్పించిన యంశము విశదమాయెను. అప్పుడుసమర్థుడు శివాజీనిచూచి "ఏమి శివబా! రాజ్యమును నాకిచ్చివైచితివిగదా? నికనీవు యేమి చేసెదవు." అని ప్రశ్నించెను. శివాజీ చేతులు మోడ్చుకొని స్వామీ? మీ చరణసేవగావించుచు గాలము గడుపుదుననెను. యీ మాటలువిని సమర్థుఁడు నవ్వి యిట్లనెను? "బాబా! ఏదియెవనికార్యమో యది వాడే చేయుట యుచితము. బ్రాహ్మణులు జప తప మొనరించి జ్ఞానసంపాదనము గావింపవలయును. క్షత్రియులు క్షాత్రధర్మపాలనము గావింపవలయును. యీ ప్రకారము దమ తమ కర్తవ్యములను నెరవేర్చుచుండుటవలన మోక్షప్రాప్తియగును. తమతమకర్మలను యథోచితరీతిగ బూర్ణపరచుటయందే జన్మసార్థక్యత్వముగలదు. పూర్వము జనకమహారాజు సహితము యాజ్ఞవల్క్యునకు తనరాజ్యమిచ్చెను. ఆసమయమున నాతడు జనకునకు రాజ్యధర్మముల నుపదేశించి రాజ్యమును తిరుగనొసంగెను. శివబా! విరాగులమగు మాబోంట్లకు రాజ్యముతో నేమియావశ్యకము. యెప్పుడేని మేమంగీకరించినచో దానిన్నివ్యవహరించుటకొక మంత్రి గావలయునుగదా. ఆమంత్రివి నీవేగమ్ము? రాజ్యము నాయదిగ భావించి

దానిని బరిపాలించుము. యీ యుపదేశమును వినగానే శివాజీ యంతః కరణము గద్గదిక మయ్యెను. యిక రాజ్యమును మరల గైకొనుట దక్క వేరొకయుపాయము లేదని తెలిసికొని శివాజి సమర్థునిట్లు ప్రార్థించెను. కృపాపూర్వకముగా నిపుడు మీ పాదుకలను నాకనుగ్రహింపుడు. వానినే సింహాసనము నందుంచి నేను నీప్రధానునివలె రాజ్య కార్యముల నెఱవేర్చెదను" సమర్థుడీప్రార్థనము నంగీకరించెను. అప్పటినుండి శివాజి తనరాజ్య చిహ్నమును (జండాను) కాషాయవర్ణముగలదిగా నొనర్చెను. మహారాష్ట్రుల కాషాయవర్ణపతాకము ఇతిహాసమున ప్రసిద్ధముగి నున్నది.

పూర్వకాలము చక్రవర్తులుసహా యెంత గురుభక్తి గల్గియుండిరో దీనివల్ల విశదమగుచున్నది.

శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురువే నమః॥

తా॥ అఖండ మండలాకారమగు చరాచరము దేనివల్ల వ్యాప్తమై యుంటున్నదో, అట్టి తత్పదము ఎవనివల్ల దర్శింపబడునో అట్టి శ్రీ గురు దేవునకు నమస్కారము.

శ్లో॥ యతః పరమకైవల్యం గురుమార్గేణ వై భవేత్
గురుభక్తిరతఃకార్యా సర్వదా మోక్షకాంక్షిభిః.

తా॥ యే కారణమువల్ల గురుమార్గమందు శ్రేష్ఠమైన మోక్షము లభించుచున్నదో, అట్టి కారణమువల్ల మోక్షాపేక్షగల వారెల్లపుడును గురుభక్తిగలిగి యుండవలయును. ఇక జనకమహారాజు యాజ్ఞవల్క్యుని యందు ఎట్టిభక్తి గల్గియుండెనో చూడుడు.

---

ఓమ్

## 17. జనక చక్రవర్తి యొక్క గురుభక్తి.

శివాజి యెంత గురుభక్తి గల్గియుండెనో జనకుడున్ను అట్టి భక్తి యాజ్ఞవల్క్య మహర్షియందు గలిగియుండెను విషయము, 'బృహ దారుణ్యకోప నిషత్తు'నందు గనందగును.

బృహదారుణ్యకోపనిషత్తు 'షష్ఠాధ్యాయము' ద్వితీయబ్రాహ్మణము.

శ్రుతి॥ సహోవాచ జనకో వైదేహోఽభయంత్వాగచ్ఛతా
ద్యాజ్ఞవల్క్య, యో నో భగవన్నభయం వేదయసే నమస్తేఽ
స్త్విమేవిదేహా, అయమహమస్మి ఇతి॥

తా॥ పూజ్యుడవగు ఓ యాజ్ఞవల్క్యుడా! నీవు ఉపాధి కృతమైన అజ్ఞానమును దూరముగా బోగొట్టుటచే జననమరణాది భయరహితమైన బ్రహ్మమును పొందించితివి. ఇట్లు ప్రత్యక్షముగా ఆత్మ స్వరూపమును పొందించిన నీకు విద్యానిష్క్రియము కొఱకు (దక్షిణగా) నే నన్యము నేమియిత్తును? గనుక నీకు నమస్కారమగును గాక. యనిపలికి, ఇవిగో విదేహదేశములు, ఇదిగో యీదేశముల కధిపతినైన నేను, యీరాజ్యమునున్ను, నన్నున్ను నీవు యథేష్టముగా పొందుమాయని పలికెను. విజ్ఞానమయమైన ఆత్మ, అవ్యవధానమును, ప్రత్యక్షమును, సర్వాంతరమును, పదమునగు, బ్రహ్మమే, త్రాడు, చవిటిభూమి, ముత్తెపుచిప్ప, ఆకాశము వీనియందు క్రమముగా, సర్పము, ఉదకము, వెండి, మాలిన్యము, యివి పరారోపణమే నిమిత్తమై గలిగినట్లు యీ పరబ్రహ్మమునకు సంసారము అన్యమగు ఉపాధియే నిమిత్తముగాగలది యగుచున్నది. జ్ఞానముచేత త్రాడు మొదలైన వాటియందలి సర్పము మొదలైనవాటిని తిరస్కరించి త్రాడు మొదలైనవాటిని తెలిసికొనునట్లు యాజ్ఞవల్క్యుని చేత బ్రహ్మస్వరూపమును బోధించుటచే ఉపాధినిమిత్తకమైన సంసారము సర్వప్రతిషేధకముగా పోగొట్టి, ఆగమమునుండి జనకమహారాజు అభయస్వరూపమైన బ్రహ్మము పొందింపబడెను.

శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్సచరాచరమ్
త్వం పదం దర్శితం యేన తస్మై శ్రీ గురువేనమః.

తా॥ స్థావరజంగమాత్మకమగు, యీ చరాచర ప్రపంచము దేనివల్ల వ్యాప్తమైయుంటున్నదో, అట్టి త్వం పదము యెవనిచే దర్శింపబడినదో, అటువంటి శ్రీ గురుదేవునకు నమస్కారము.

శ్లో॥ చిన్మయ వ్యాపితం సర్వం త్రైలోక్యం స చరాచరమ్
అసి త్వం దర్శితం యేన తస్మై శ్రీ గురువేనమః.

తా॥ చరాచరములతో గూడిన యీ మూడులోకములు యావ

తును, చిన్మయమువల్ల వ్యాపించబడినదో, అట్టి అసత్యము యవనివల్ల దర్శింపబడినదో, అటువంటి శ్రీ గురుదేవునకు నమస్కారము.

వి॥ నిజముగా బ్రహ్మపదమునంద జేసిన గురుదేవునకు ప్రత్యుప కారముగా యీమూడు లోకములందును యిచ్చుటకు మరియేమియు లేదు. అచటయేది ప్రత్యుపకారమో, అది కైవల్య నవనీతము నిరూ పించుచున్నది. నిజముగా యాలోచించిన అదియేసత్యము. ఓమ్.

---

ఓమ్.

## 18. కైవల్య నవనీతము.

చ॥ నిరతిశయానుభూతి సుఖనీరధి బూర్ణముఁగామునింగి ప్రా
క్కరణ తనూముఖాఖిల వికారములెల్లనడంగ జిత్సుఖో
త్కరహృదఖండమైన తనుగన్గొన దత్పరిపూర్ణ దేశికుఁ
దురుతర బోధసు ప్రగనినూర్జితభావముతో నిమ్మలుఁ.

తా॥ శిష్యుడు— 'నేతినేతి' యనెడు మహావాక్యముచేత యిది బ్రహ్మముగాదు. యిది బ్రహ్మముగాదని, యన్నిటినితోియగా కడ పటనిలిచిన బ్రహ్మభిన్నప్రత్యగాత్మానుభవరూపమైన నిరతి శయానంద సముద్రమునందు లెస్సగామునింగి విజ్ఞానము వలన గలిగిన యానంద ముతో గూడిన యతఃకరణము పరబ్రహ్మాకారమై పరిణమింపగా, అఖండ పరిపూర్ణమైనతనను, సచ్చిదానంద స్వరూపుఁడైన యాచా ర్యుండు కుతూహలముతో జూడగా, నిర్వికల్ప నిష్ఠాభావమందుండిట్లు వచించెను.

మ॥ పరిపాకస్థితినుండి, కొంత తడవాపంథాను ర క్తిఁలఘు
స్ఫురణన్ మేల్కొని తన్మయంబుగని యుద్బోధప్రమోదాశ్రుయు
క్వర వక్త్రింబిలసో కరమొక్క కరయుగ్మంబెత్తి వేచేర్చి
మూర్ధ్నిరహిన్ధ్యానమొనర్చి పల్కదొడఁగెఁ ధీరస్థితప్రజ్ఞుఁడై.

తా॥ పరిపక్వజ్ఞానముగల గురుడు జెప్పిన యోగమార్గముచేత, కొంతతడవు బ్రహ్మనిష్ఠయందుండి సర్వవికారములనువిడిచి, బ్రహ్మా కారమైయున్న, తనమనస్సునుజూచి సంతోషించి యానందబాష్పముల

చేత ముఖమును నేలమీదమోపి గురువునకు నమస్కరించిలేచి, చేతులుమోడ్చి మనస్సున యాచార్యునితో తన యనుభవమును తెలుప పారంభించెను.

శా॥ అయ్యా? దేశికయంతరాత్ముఁడవు నీవై మద్భవానంతమం
దయ్యో పొందుచు బ్రోచుచుం బిదప మర్త్యా కారముం బూని
నాకయ్యాలించి కృతార్థుజేసితివి చేకూరంబదార్థంబు మీ
కియ్యన్ నేరొ కలేదిగాన నికనెందే లెంకనై గొల్చెదన్.

తా॥ ఓ యాచార్యా? సర్వదేవాన్తర్యామివైన నీవు నాయంతరంగమందు వసించి ఎన్నరాని జన్మములను నేనుపొందునపుడు సన్మార్గమున ప్రవర్తించు వానిగజేసి పిదప కర్మ, భక్తి, వైరాగ్య యోగములలో నాబుద్ధిని ప్రవేశింపజేసి శుద్ధపఱచి నీవు మానుషవేషమున ప్రత్యక్షమై నామొఱనాలకించి యపరోక్ష బ్రహ్మ సాక్షాత్కారమైన, యభేద జ్ఞానము నుపదేశించితివి. ప్రత్యుపకారమేమియు జేయగాన్పించుటలేదు.

శా॥ అంతేవాసి నుతింప నిక్కరణినయ్యాచార్యుఁడీక్షించి వే
చెంతం జేరగ జేరి శిష్యుని సుఖాసీనుఁడగంజేసి వి
శ్రాంతిం పాపుట కంతరాయములు పుత్రామూఁడుభాసిల్లు సు
స్వాంతంబొప్ప హరింపవానినదె సత్ప్రత్యుపకారంబగున్.

తా॥ శిష్యుడీవిధమున గొనియాడగా, నాచార్యుడు పరమకరుణతో దగ్గరకురమ్మని పిలిచి, కూర్చుండనునిచి, ఓ పుత్రుడా? స్వరూపసాక్షాత్కారజ్ఞానమును భంగపఱచెడు, మల, విక్షేప, ఆవరణ, లేక సంశయ, అసంభావన, విపర్యయములనెడు, మూఁడుదోషములను నేకాలమందును, ఆత్మలోజేరనీయక నీయొక్క సాక్షాత్స్వరూప జ్ఞాననిష్ఠయుందుండుటేదిగలదో, అదే నీవొనర్చెడి ప్రత్యుపకారమని గురువు సమాధానమిడెను.

నిజముగా ఆలోచించిన గురువుపదేశించిన లక్ష్యమునుండి జారకుండుటయు, గురువుయొక్క నిజస్వరూపము యేబ్రహ్మరూపమై యుండునో, అట్టి స్థితి గలిగియుండుటయే యీబ్రహ్మవిద్యయందు ప్రత్యుపకారమగును, వేరేమి యిచ్చిననుచాలదు. గురుదేవునకు ప్రీతికరమగు అనేకధర్మకార్యము లొనర్చుటచేతను, గురుసేవాదికార్యములు చేయుట

చేతమాత్రము గురు ఋణముత్తీరజాలదు. గురుదేవునిచే బోధింపబడిన, బ్రహ్మ స్వరూపమునొంది, మలవిక్షేపావరణములను మూడుదోషము లేమాత్రమైనను లేని యవస్థనుగలిగి, గురువు తనకుబోధించినట్లు పయగలిగి, తనదగ్గరజేరిన భక్తులకువదేశించినపుడే గురుఋణము తీర్చినవారగుదురు. సీతారామాంజనేయము.

సీ॥ గురుపదాంభోజముల్ గొలువకల్గునే
ప్రవిమల వైరాగ్య భాగ్యమహిమ
గురుపాదతీర్థంబు గొనకున్న గల్గునే
జ్ఞానవిజ్ఞాన యోగానుభవము
గురుసుప్రసాదంబు గొనకున్న గలుగునే
పతిలేనిచిత్తోపరతిసుఖంబు
గురుతత్వమాత్మ గన్గొకున్న గల్గునే
నిరతిశయంబైన పరమపదము.

తే॥ అట్లుగావున విద్యార్థియైనయోగి
వినయభయభక్తులెదలోన బెనగొనంగ
నలచతుర్విధ శుశ్రూషలాచరించి
కొనుచు ననిశంబు గురువులగొలుచు ననఘ. ఓమ్.

## 19. గురు గీత.

యీ గురుగీత పరమశివుండు పార్వతీదేవికి ఉపదేశించినది. ఇది మూడు అధ్యాయములతో గూడినది. శ్రీ భగవద్గీత యేలాగున భారతాన్తర్గతమో ఆలాగునయిదియుస్కాందమహాపురాణాన్తర్గతమైయున్నది. నిజముగా శిష్యుని వర్తనమెట్లుండవలయునో, యెట్టిలక్షణము గలవాడు గురుదేవుడగునో, గురుశిష్యులకు భయులకు గలసంబంధమెట్టిదో, యీలాటి ధర్మములన్నియు యీగ్రంథములో వివరించునట్లు మరియేగ్రంథమునందైనను గనుపించదు. దీని చదివి గురుశిష్యులయొక్క ధర్మమెంత పవిత్రమైనదో, తలంచి తలంచి శిష్యుండు ఆనందబాష్పములలో మునగకపోడు. కావున భక్తులందరున్ను యీలాటి గ్రంథములను జదువవలయును. ఓమ్

ఋషయః ఊచుః

శ్లో॥ సూత సూత మహాప్రాజ్ఞ నిగమాగమపారగ
గురుస్వరూపమస్మాకం బ్రూహి సర్వమలాపహమ్ ॥ 1

తా॥ మహాధీమంతుడవగు ఓసూతమహర్షీ! వేదములను ఆగమములను పూర్తిగా తెలిసికొనిన ఓ సూత ఋషివరేణ్యా! మాకు సమస్త మాయా మాలిన్యములను పోగొట్టునట్టి గురుస్వరూపమును చెప్పుమా! (అనిన శౌనకాది ఋషీశ్వరులు అడిగిరి.)

శ్లో॥ యస్య శ్రవణ మాత్రేణ దేహీ దుఃఖాద్విముచ్యతే
యేన మార్గేణ మునయః సర్వజ్ఞత్వం ప్రపేదిరే ॥ 2

తా॥ యే గురుస్వరూపమును శ్రవణము చేసినంత మాత్రము చేతనే సమస్త ప్రాణులు దుఃఖమునుండి విముక్తిని ఒడయుచున్నవో, యే మార్గముచేత మునులు సర్వజ్ఞత్వమును బడసిరో.

శ్లో॥ యత్ ప్రాప్య న పునర్యాతి నరఃసంసారబంధనమ్
తథావిధం పరంతత్త్వం వక్తవ్యమధునాత్వయా ॥ 3

తా॥ దేనినిపొంది నరుడు సంసారబంధనమున మరల చిక్కుకొనడో అటువంటి శ్రేష్ఠమగు గురుతత్త్వమును యిప్పుడు మాకెరింగింప వలయును

శ్లో॥ గుహ్యాద్గుహ్యతమం సారం గురుగీతావిశేషతః
త్వత్ ప్రసాదాచ్చ శ్రోతవ్యా తత్సర్వం బ్రూహి సూత నః ॥ 4

తా॥ రహస్యములకంటె మిక్కిలి రహస్యమైనదియు, సారమైన దియు, గురుగీత విశేషమును మీ యనుగ్రహమువలన వినదగినది. అందు వలన, ఓ సూతమహర్షీ! సమస్తమును మాకుచెప్పుము.

శ్లో॥ ఇతి సంప్రార్థితస్సూతో ముని సంఘైర్ముహుర్ముహుః
కుతూహలేనమహతా ప్రోవాచ మధురం వచః ॥ 5

తా॥ ఈ ప్రకారముగా శౌనకాది మహర్షులచే మిక్కిలి ప్రార్థింప సూతమహర్షి మిక్కిలి సంతోషముతో (వార్లనుచూచి) మధురమగు వాక్యములను పలికెను.

సూతఉవాచ = సూతుడు పలికెను.

శ్లో॥ శృణుధ్వం మునయస్సర్వే శ్రద్ధయా పరయాముదా
వదామి భవరోగఘ్నం గీతాం మాతృస్వరూపిణీమ్ ॥ 6

తా॥ సంసారరోగధ్వంసకమును మాతృ స్వరూపిణియునగు గురు గీతను చెప్పుచున్నాను. ఓ మునీశ్వరులారా! మీరందఱు పరమశ్రద్ధతో మిక్కిలి సంతోషముతోను వినుడు.

శ్లో॥ పురా కైలాసశిఖరే సిద్ధగన్ధర్వ సేవితే
తత్రకల్పలతాపుష్పమన్దిరేఽత్యంతసున్దరే ॥ 7

తా॥ పూర్వము సిద్ధాదులచే సేవింపబడుచున్న కైలాస శిఖరము నందు మిక్కిలి సుందరమగు కల్పవృక్షపుష్పములచే కూడుకొన్న దివ్య మందిరము నందు.

శ్లో॥ వ్యాఘ్రాజినే సమాసీనం శుకాదిముని వన్దితం
బోధయన్తం పరం తత్త్వం మధ్యే మునిగణం క్వచిత్ ॥ 8

తా॥ మధ్యలో వ్యాఘ్రాసనమున కూర్చున్నట్టియు శుకాది మహా మునులచే స్తోత్రముచేయబడు చున్నట్టియు మునిగణమునకు పరతత్త్వ మును బోధించునట్టి ఈశ్వరుని ఒకానొక సమయమున.

శ్లో॥ ప్రణమ్య వదనా శశ్వన్నమస్కుర్వన్తమాదరాత్
దృష్ట్వా విస్మయమాపన్నా పార్వతీ పరిపృచ్ఛతి ॥ 9

తా॥ యెల్లప్పుడును నమస్కారము చేయుచున్న ఈశ్వరునిగాంచి ఆశ్చర్యమును పొందినదై నమ్రముఖియగు పార్వతీదేవి పరమ ప్రీతితో అడుగుచున్నది.

పార్వత్యువాచ = పార్వతీదేవి నుడివెను.

శ్లో॥ ఓంనమో దేవ దేవేశ పరాత్పర జగద్గురో
త్వాం నమస్కుర్వతే భక్త్యాసురాసురనరాస్సదా ॥ 10

తా॥ ఓ ప్రణవ స్వరూపా! ఓదేవా! ఓదేవేశా! ఓపరాత్పరా! జగ ద్గురో మిమ్ములను దేవతలు అసురులు నరులు యెల్లప్పుడును భక్తితో నమస్కరించు చున్నారు.

శ్లో॥ విధివిష్ణుమహేన్ద్రాద్యైర్వన్ద్యః ఖలు సదా భవాన్
నమస్కరోషి కస్మై త్వం నమస్కారాశ్రయఃకిల ॥ 11

తా॥ బ్రహ్మ విష్ణు మహేంద్రాదులచే యెల్లప్పుడు స్తుతింపదగిన, ఓ మహేశా! మీ రెవరికొరకు నమస్కరించుచున్నారు. మీరు సకలదేవతల నమస్కారములకు తగినవారుగదా?

శ్లో॥ దృష్ట్వైతత్కర్మ విపుల మాశ్చర్యం ప్రతిభాతి మే
కిమేతన్న విజానేహం కృపయా వద మే ప్రభో॥ 12

తా॥ యిటువంటి నమస్కారరూప కర్మను చూచి, నాకు మిగుల ఆశ్చర్యము గల్గుచున్నది. ఇందులకు కారణంబేమియో నే నెరుంగజాలను. ఓ ప్రభో! దయతో ఈవిషయమును నాకుచెప్పుము.

శ్లో॥ భగవన్ సర్వధర్మజ్ఞ వ్రతానాం వ్రతనాయకం
బ్రూహి మే కృపయా శంభో గురుమాహాత్మ్యముత్తమమ్॥ 13

తా॥ ఓ పూజ్యుడా! సమస్త ధర్మముల నెఱింగినవాడా! వ్రతములన్నిటిలో ముఖ్యమగు వ్రతమగు అత్యుత్తమగు గురుమాహాత్మ్యము నకు మంగళ స్వరూపా! నాకుదయతో నుడువుము.

శ్లో॥ కేన మార్గేణ భోస్వామిన్ దేహీ బ్రహ్మమయో భవేత్
తత్కృపాం కురు మే స్వామిన్ నమామి చరణౌ తవ। 14

తా॥ ఓ స్వామీ! ఏ మార్గము నవలంబించి శరీరి (ఆత్మ) బ్రహ్మస్వరూప మొందునో ఆ మార్గమును నాకు దయతో బోధింపుము. ఓ స్వామీ! మీచరణములకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఇతి సంప్రార్థితశ్శశ్వన్మహాదేవో మహేశ్వరః
ఆనంద భరితః స్వాన్తే పార్వతీమిదమబ్రవీత్॥ 15

తా॥ ఇవ్విధమున మిగుల ప్రార్థింపఁబడిన మహేశ్వరుఁడగు మహాదేవుడు మనస్సున యెల్లప్పుడానందముతో కూడినవాడై పార్వతినిగూర్చి యీ వాక్యమును బల్కెను.

శ్రీ మహాదేవఉవాచ, ఈశ్వరుడు చెప్పెను.

శ్లో॥ నవక్తవ్యమిదం దేవి రహస్యాతిరహస్యకం
నకస్యాపి పురాప్రోక్తం త్వద్భక్త్యర్థం వదామి తం॥

తా॥ ఓ దేవి! ఇది మిగుల రహస్యముల కన్నిటిలోను రహస్యమైనది. ఇట్టిది యెవరికిని చెప్పదగినదికాదు. ఎవరికి ముందెప్పుడును చెప్పబడి యుండలేదు. అట్టిదానిని మీభక్తినుద్దేశించి చెప్పుచున్నాను.

శ్లో॥ మమరూపాసి దేవి త్వమత స్తత్కథయామి తే
లోకోపకారకప్రశ్నో న కేనాపి కృతః పురా॥ 17

తా॥ ఓ దేవీ! నీవు నారూపమే యగుచున్నావు. ఇందువలన యట్టి రహస్యమగు దానిని నీకునేను చెప్పుచున్నాను. ఈ ప్రశ్న లోకోపకారక మైనది. ఇంతవఱకెవరును ప్రశ్నించి యుండలేదు.

శ్లో॥ యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥ 18

తా॥ ఏ పురుషునకు దైవమునందు యెట్టియుత్కృష్ట భక్తిగలదో, దైవమునందు యుండునటుల గురువునందును, గురుత్వమున్ను గలదో, అట్టిమహాత్మునకు సకలజ్ఞానాది అర్థములు ప్రకాశించునటుల జెప్పబడినవి గదా!

శ్లో॥ యో గురుః సశివః ప్రోక్తః యశ్శివః సగురుస్స్మృతః
వికల్పం యస్తు కుర్వీత స నరో గురుతల్పగః॥ 19

తా॥ ఎవడు గురుదేవుడో, ఆగురువు శివుండనబడుచున్నాడు. ఏపురుషుడు శివుడని చెప్పఁబడుచున్నాడో, ఆ శివుడే గురువనియు చెప్పబడెను. ఇటులభావనజేయుక యెవడు విరుద్ధముగా (గురువువేరు, శివుడువేరు,) అని తలంచునో, అట్టిమానవుడు గురుతల్పగతుఁడగు వాని గతిని పొందును.

శ్లో॥ దుర్లభం త్రిషులోకేషు తచ్ఛృణుష్వ వదామ్యహం
గురుబ్రహ్మ వినా నాన్యః సత్యం సత్యం వరాననే॥ 20

తా॥ మూఁడులోకములలోను దుర్లభమైన దానిని చెప్పుచున్నాను వినుము. ఓ పార్వతీ! గురువే బ్రహ్మస్వరూపము, ఇతరమెద్దియు లేదని సత్యముగా సత్యముగా జెప్పుచున్నాను.

శ్లో॥ వేదశాస్త్రపురాణాని చేతిహాసాదికాని చ
మన్త్రయన్త్రవిద్యాదీని మోహనోచ్చాటనాదినమ్॥ 21
శైవశాక్తాగమాదీని హ్యన్యేచ బహవోమతాః
అపభ్రంశాస్సమస్తానాం జీవానాం భ్రాన్తచేతసామ్॥ 22

తా॥ వేదశాస్త్ర పురాణములను ఇతిహాసాదులును, మోహనో చ్చాటనాదులును, మన్త్రయన్త్రవిద్యాదులును, శైవశాక్తాగమాదులును, మఱియు యితరములగు సాంఖ్యాదిమతములను, భ్రాన్తచేతస్కులగు (గురుతత్త్వము నెఱుంగని) సమస్త జనులకు పై జెప్పినవన్నియు, అపభ్రంశ ములు. అనగా వీనివల్ల తత్త్వము తెలియజాలరు.

శ్లో॥ జపస్తపోవ్రతం తీర్థం యజ్ఞోదానం తథైవ చ ।
గురుతత్త్వమవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ ప్రియే ॥ 23

తా॥ ఓ ప్రియమగు గౌరీ! గురుతత్త్వము నెఱుంగనివాని జపము, తపము, వ్రతము, తీర్థస్నానము, యజ్ఞము, దానమిత్యాది సమస్త పుణ్యకర్మలును వ్యర్థము లేయగును. గురుభక్తి లేనివారికి పై జెప్పినవన్నియు సార్థకములు కావని భావము.

శ్లో॥ గురుబుద్ధ్యాత్మనో నాన్యత్ సత్యం సత్యం వరాననే
తల్లాభార్థం ప్రయత్నస్తు కర్తవ్యశ్చ మనీషిభిః ॥ 24

తా॥ ఓ భవానీ! గురుజ్ఞానముచేతనే, ఆత్మకు వేఱగునది మఱి యొకటి లేదని జ్ఞానము గల్గును. ఇది సత్యము. ఇది సత్యము. అట్టి గురు జ్ఞానము కొఱకు వివేకవంతులచే యట్టి ప్రయత్నము జేయందగినది.

శ్లో॥ గూఢా విద్యా జగన్మాయా దేహశ్చాజ్ఞానసంభవః
విజ్ఞానం యత్ప్రసాదేన గురు శబ్దేన కథ్యతే । 25

తా॥ జగత్తు, మాయ, గూఢమైన అవిద్య, దేహము, అజ్ఞానము వలనగలిగినదను జ్ఞానము యేగురువనుగ్రహమువలన గలుగునో అట్టి మహనీయుడే గురుశబ్దముచేత జెప్పందగియున్నాడు.

శ్లో॥ యదంఘ్రికమలద్వన్ద్వం ద్వన్ద్వతాప నివారకం
తారకం భవసిన్ధోశ్చ తం గురుం ప్రణమామ్యహమ్ ॥ 26

తా॥ ఎవని చరణ కమల ద్వన్ద్వము సుఖదుఃఖాది ద్వంద్వతాప నివారకమో సంసారసాగరతారకమో, అట్టిగురువును నేను నమస్కరించు చున్నాను.

శ్లో॥ దేహీబ్రహ్మ భవేద్యస్మాత్ త్వత్కృపార్థం వదామి తత్
సర్వపాప విశుద్ధాత్మా శ్రీ గురోః పాద సేవనాత్ ॥ 27

తా॥ ఓ కాత్యాయనీ! శ్రీ గురుదేవుని యొక్క యే పాదసేవచే దేహి సర్వపాపములనుండి విడువడి విశుద్ధాత్ముడై పరబ్రహ్మమే యగుచున్నాడో, ఆవిషయమును నీయందలి కృపచే జెప్పుచున్నాను.

శ్లో॥ స్వదేశికస్యైవ చ నామకీర్తనం భవేదనంతస్య శివస్య కీర్తనం।
స్వదేశికస్యైవచ నామ చింతనం భవేదనంతస్యశివస్యచింతనం॥

తా॥ స్వదేశికేంద్రుడగు గురువుయొక్క నామకీర్తన స్మరణములు చేసిన అనవంతుడగు శివుని స్మరణములు చేసినట్లే యగును. అనగా గురుదేవుడే మంగళ స్వరూపియగు సాక్షాత్పరమాత్మయనియు (శివుండు) చెప్పబడు చున్నాడు.

శ్లో॥ యత్పాదరేణుర్వైనిత్యం కోపి సంసారవారిధౌ
సేతుబంధాయతే నాథం దైశికం తముపాస్మహే ॥ 30

తా॥ ఏ గురుమూర్తి ఒకానొక పాదరేణువు సంసారసముద్రమును దాటుటకు యెప్పుడును సేతు బంధముగా (వంతెన) అగుచున్నదో, నాథుడగు అట్టి దేశికేంద్రవరేణ్యుని నేనుపాసించుచున్నాను.

శ్లో॥ యదనుగ్రహమాత్రేణ శోకమోహా వినశ్యతః
తస్మై శ్రీ దేశికేంద్రాయ నమోస్తు పరమాత్మనే ॥ 31

తా॥ యెవని యనుగ్రహలవము చేతనే శోకమోహములు నశించి ఏకత్వజ్ఞానము కలుగుచున్నదో, అటువంటి పరమాత్మ యగు శ్రీ దేశికేంద్రునికి నానమస్కారము.

శ్లో॥ యస్మాదనుగ్రహం లబ్ధ్వా మహదజ్ఞానముత్సృజేత్
తస్మై శ్రీ దేశికేంద్రాయ నమశ్చాభీష్టసిద్ధయే ॥ 32

తా॥ ఏ గురుయొక్క అనుగ్రహముబొంది మానవుడు మూలాజ్ఞానమునుండి విడువబడు చున్నాడో, అట్టి శ్రీ దేశికేంద్రస్వామిని నాయభీష్ట సిద్ధికొఱకు నమస్కరించెదను.

శ్లో॥ కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకం
గురుర్విశ్వేశ్వరస్సాక్షాత్ తారకం బ్రహ్మనిశ్చయః ॥ 33

తా॥ గురుదేవుని నివాస స్థలమే కాశీక్షేత్రము. వారి పాదోదకమే గంగాతీర్థము. గురుదేవుడే సాక్షాద్విశ్వేశ్వరుండు. బ్రహ్మ నిశ్చయజ్ఞానమే విశ్వేశ్వరునిచే యుపదేశించబడు తారకము.

శ్లో॥ గురుసేవా గయా ప్రోక్తా దేహస్స్యాదక్షయోవటః
తత్పాదం విష్ణుపాదం స్యాత్ తత్రదత్తమన స్తతం ॥ 34

తా॥ గురుసేవయే గయగా చెప్పడినది. దేహమే అక్షయమగు వట వృక్షము. శ్రీగురుపాదమే విష్ణుపాదము. గురుపాదము నంకర్పింప బడిన మనస్సే వ్యాపక స్వరూపము.

శ్లో॥ గురుమూ ర్తింస్మరేన్నిత్యం గురోర్నామ సదాజపేత్
గురోరాజ్ఞాం ప్రకుర్వీత గురోరన్యన్నభావయేత్ ॥ 35

తా॥ గురుమూ ర్తిని యెల్లప్పుడు స్మరించవలయును. శ్రీ సద్గురు నామమునె యెల్లప్పుడు జపించవలయును. గురువుయొక్క ఆజ్ఞ నే యెప్పుడును ఆచరణలో యుంచవలయును. గురుబ్రహ్మముకన్న ఇతర భావనజేయగూడదు

శ్లో॥ స్వాశ్రమం చ స్వజాతీం చ స్వకీ ర్తిం పుష్టివర్ధనం
ఏతత్సర్వం పరిత్యజ్య గురుమేవ సమాశ్రయేత్ ॥ 36

తా॥ తన ఆశ్రమమును, తనజాతిని, తనకీ ర్తిని, తన ఐశ్వర్యాదికమును ఈసమ స్తమునువదలి శ్రీ సద్గురువునే యాశ్రయించవలయును. ఇటుల వకాణించుటచే తన యు త్తమవంశాది ప్రయుక్తాభిమానమును వీడి మహాత్ముడగు గురువును యెందుండినను ఆశ్రయించవలయును.

శ్లో॥ అనన్యాశ్చింతయంతోయే సులభం పరమా సుఖం
తస్మాత్సర్వం ప్రయత్నేన గురోరారాధనం కురు॥ 37

తా॥ గురు పరబ్రహ్మమునే చింతించుచున్నవారలు ఉత్కృష్టమగు సుఖమును సులభముగా బొందుచున్నారు. అందువలన సర్వవిధముల బ్రయత్నించి శ్రీ సద్గురుదేవునే, ఓపార్వతీ! నీ వారాధింపుము.

శ్లో॥ గురువ క్త్రే స్థితావిద్యా గురుభక్త్యా చ లభ్యతే
త్రైలోక్యే స్ఫుటవక్తారో దేవర్షిపితృమానవాః॥ 38

తా॥ గురుముఖమునందు యుంటున్నవిద్య (బ్రహ్మవిద్య) గురుభ క్తి చేతనే బొందపడుచున్నది. అని ఈమూడులోకములోను దేవర్షులు, పితృదేవతలు, మానవులు, స్పష్టముగా జెప్పెరి.

శ్లో॥ ఏవం గురుపదం శ్రేష్ఠం దేవానామపి దుర్లభమ్
హాహాహూహూగణై శ్చైవ గన్ధర్వాద్యైశ్చ పూజితం॥ 39

తా॥ ఇవ్విధముగ గురుపదము శ్రేష్ఠమైనది. దేవతలకును దుర్లభము. హాహాగణము హూహూగణముచేతను, గన్ధర్వులు మొదలగు వార్ల చేతను పూజింపబడినది.

శ్లో॥ ధ్రువం తేషాం చ సర్వేషాం నాస్తి తత్త్వం గురోఃపరం
గురోరారాధనం కుర్యాత్ స జీవత్వం నివేదయేత్॥ 40

తా॥ ఎల్లవారికి గురువుకన్న ఉత్కృష్టమగు యథార్థవస్తువు వేఱు లేదు. ఇది నిశ్చయము గనుక గురువుయొక్క ఆరాధనమును చేయవల యును. గురువు కొఱకు జీవత్వముతోగూడ నివేదనము చేయువలయును.

శ్లో॥ కర్మణా మనసా వాచా సర్వదాఽఽరాధయేద్గురుం
దీర్ఘదండం నమస్కృత్య నిర్లజ్జో గురుసన్నిధౌ॥ 42

తా॥ గురు సన్నిధానమున శిష్యుడు ఒకించుకయు సంకోచభావము లేనివాడై దీర్ఘదండప్రణామ మాచరించి కర్మచేతను, మనస్సుచేతను, వాక్కుచేతను, (మూటినియేకముజేసి) గురువును యెల్లప్పుడారాధించ వలయును.

తా॥ శరీరమింద్రియప్రాణమర్థం స్వజనబాన్ధవాౕ
ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యో నివేదయేత్॥ 43

తా॥ శరీరము, ఇంద్రియములు, ప్రాణము, ధనము, తన బంధుజా లము, స్వభార్య మొదలుగాగలవాటియందలి యభిమానమును వదలి గురువునే తను ధనమనముల సమర్పణ పూర్వకముగ శరణుబొందవలెను.

శ్లో॥ గురురేకోజగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకం
గురోః పరతరం నాస్తి తస్మాత్సంపూజయేద్గురుం॥ 44

తా॥ బ్రహ్మవిష్ణు శివాత్మకమగు ఈజగత్తంతయు గురుస్వరూపమే గురువుకంటె యుత్కృష్టమైనది మఱియొకటిలేదు. అందువలన గురువునే పూజించవలయును.

శ్లో॥ సర్వశ్రుతిశిరోరత్న విరాజిత పదాంబుజమ్
వేదాంతార్థ ప్రవక్తారం తస్మాత్సంపూజయేద్గురుం॥ 45

తా॥ సకలోపనిషద్రత్నములచే విరాజిల్లు పదాంభోజములచే గూడుకొన్నవాడును, అనగా సకలోపనిషత్సారభూతుడును, సకల వేదాంతార్థములను బోధించునట్టి గురువును బూజించవలయును,

శ్లో॥ యస్య స్మరణమాత్రేణ జ్ఞానముత్పద్యతే స్వయం
స ఏవసర్వసంపత్తిః తస్మాత్సంపూజయేద్గురుమ్॥ 47

తా॥ యే మహామహుని స్మరించుటచేతనే జ్ఞానము స్వయముగా కలుగుచున్నదో, ఆగురువు సర్వజ్ఞానసమృద్ధి సంపన్నుడు. అందువల్ల గురువునే పూజించవలయును.

శ్లో॥ ఏక ఏవ పరోబన్ధుః విషమే సముపస్థితే ।
గురుస్సకలధర్మాత్మా తస్మై శ్రీ గురవేనమః ॥ 48

తా॥ సకలాపత్తుల సమయములోను సకల ధర్మస్వరూపుడగు శ్రీ సద్గురు వొక్కడే బంధవిమోచక పరమ బంధువు.

శ్లో॥ ధ్యాన మూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం ।
మంత్రమూలం గురోర్వాక్యం ముక్తి మూలం గురోఃకృపా ॥ 49

తా॥ గురువుయొక్క మూర్తియే ధ్యానమునకు మూలము. గురువు యొక్క పాదమే పూజకుమూలము. గురువుయొక్క వాక్యమే మంత్రమునకు మూలము. గురువుయొక్కదయయే ముక్తికి కారణము.

శ్లో॥ సప్తసాగర పర్యన్తం తీర్థస్నానఫలం తు యత్ ।
గురుపాదోదకంబిందోః సహస్రాంశేన తత్ఫలమ్ ॥ 50

తా॥ సప్తసముద్రముల పర్యన్తము గల సకల తీర్థస్నానఫలము ఏది కలదో, అది శ్రీగురుపాదోదక బిందువులోని సహస్రాంశ ఫలమునకును సరిగాదు.

శ్లో॥ శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన
లబ్ధ్వా కులగురుం సమ్యక్ గురుమేవసమాశ్రయేత్ ॥ 51

తా॥ శివుండు కోపించినను గురువు రక్షణను జేయగల్గును. గురుదేవుండు విముఖుడైనచో వేఱొకదేవ్వడు రక్షింపసమర్థుడు గాడు, అనగా గురుకృపతప్పిన విష్ణ్వాది సకలదేవతలును పరాఙ్ముఖులే యగుచున్నారు. గనుక గురుని ఆశ్రయించి యట్టి లోకవంద్యుడగు పరమ గురువునే శరణుజొచ్చవలయును.

శ్లో॥ మధులుబ్ధో యథా భృంగః పుష్పాత్పుష్పాంతరం వ్రజేత్ ।
జ్ఞానలుబ్ధస్తథా శిష్యో గురోర్గుర్వంతరం వ్రజేత్ ॥

ఆ పుష్పములోని పుష్పరసమును గ్రోలనిచ్ఛయించు భ్రమరమెట్టుల తనతృప్తి కొఱకై ఒకపుష్పమును వదలి మఱియొక కుసుమమునుగూర్చి తృప్తినొందువరకు పోవుచున్నదో, ఆలాగున పరిపూర్ణ జ్ఞానమును బడయ గోరిన శిష్యుడు అట్టి పూర్ణజ్ఞానము నిస్సందిగ్ధముగా గలుగువఱకు ఒక గురువును వదలి మఱియొక పరమగురువును ఆశ్రయించ వచ్చును. ఓహో! పార్వతీదేవికి పరమశివుడు గురువిషయమై యెంత విశాలభావ ముతో బోధించెనో, విజ్ఞులు కనుగొనగలరు. లోకములో కొందరు గురువులు తమశిష్యుడు తనకన్న యెక్కువ యున్నతస్థితిని పొందకూడ దనియు, తనగౌరవము లోకములో తగ్గుననియు భ్రాంతి జెంది, పతివ్రతా స్త్రీ మఱియొక భర్తను ఆశ్రయించనట్టుల యథార్థ గురుభక్తి గలవాడు మఱియొక గురువునాశ్రయించుట తగదని నుడువు దురు. ఇట్టి సంకోచభావములకు అవకాశములేదని ఇచ్చోట తెలియ నగును.

శ్లో॥ వందే గురుపదద్వంద్వం వాఙ్మనోఽతీత గోచరమ్
శ్వేతరక్తప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరం॥ 53

తా॥ వాఙ్మనస్సుల కతీతమైనట్టియు శ్వేతరక్త కాంతితో సమాన మైనట్టియు శివశక్త్యాత్మకమగు పరమోత్కృష్టమైన శ్రీ సద్గురు పద యుగ్మమును నమస్కరించుచున్నాను.

శ్లో॥ అత్రినేత్రః శివస్సాక్షాద్ద్విబాహుశ్చ హరిస్స్మృతః
యోఽచతుర్వదనో బ్రహ్మ శ్రీగురుః కథితః ప్రియే॥ 54

తా॥ శ్రీ గురుదేవుండు మూడవ నేత్రములేని సాక్షాదీశ్వరుడు, రెండుచేతులుగల విష్ణుదేవుండు, నాలుగు ముఖములులేని బ్రహ్మదే వుడని, ఓగౌరీ! నీవు తెలిసికొనుము. ఇట్లని చెప్పుటచే బ్రహ్మవిష్ణు మహేశ్వరాత్మకుడు గురువని స్పష్టముగా తెలియబడెను

శ్లో॥ అయం మయాంజలిర్బద్ధో దయాసాగరసిద్ధయే
యదనుగ్రహతో జంతుః చిత్రసంసార ముక్తిభాక్॥ 55

తా॥ ఏ గురువనుగ్రహమువలన సకలప్రాణులు విచిత్రసంసారము నుండి ముక్తిని పొందుచున్నారో, అట్టి కృపాసాగర కృపను సిద్ధించు టకై, ఇదిగో నాచే నమస్కారాంజలిని బద్ధమయ్యె (చేయబడెను.)

శ్లో॥ శ్రీగురోః పరమం రూపం వివేక చక్షురగ్రతః
మందభాగ్యా న పశ్యంతి అంధాః సూర్యోదయం యథా ॥ 56

తా॥ వివేకచక్షువే (జ్ఞాననేత్రుడే) ప్రత్యక్షముగా శ్రీపరమగురుని పరరూపమును గాంచసమర్థుడు. అనగా శ్రీగురుపరబ్రహ్మము యొక్క సాక్షాత్కారములో వివేకజ్ఞానమే పరమసాధనము. గ్రుడ్డివార్లు సూర్యోదయమును చూడజాలనట్లు మందభాగ్యులు ప్రత్యక్షమగు గురుదేవుని గాంచలేరు.

శ్లో॥ కులానాం కులకోటీనాం తారకస్తత్ర తత్క్షణాత్
అతస్తం సద్గురుం జ్ఞాత్వా త్రికాలమభివాదయేత్ ॥ 57

తా॥ శ్రీ సద్గురుమూర్తి తనయొక్క కులస్థులకు యితర అనేక కులస్థులకును, అనగా ప్రాణిమాత్రుల సర్వులకును తత్క్షణమునందే యచ్చోటనే సంసార తారకుడై యుంటున్నాడు. ఇందువలన శ్రీసద్గురుని గుర్తెఱింగి త్రికాలములయందును, అభివాదన మాచరించవలయు.

శ్లో॥ శ్రీనాథచరణద్వంద్వం యస్యాందిశి విరాజతే
తస్యాందిశి నమస్కుర్యాత్ భక్త్యా ప్రతిదినం ప్రియే॥ 58

తా॥ ఓపార్వతీ ! శ్రీగురుపదద్వంద్వము యే దిక్కున విరాజిల్లుచున్నదో, ఆదిక్కునకు ప్రతిదినము పరభక్తితో నమస్కారము జేయవలయును.

శ్లో॥ సాష్టాంగప్రణిపాతేన స్తువన్నిత్యం గురుం భజేత్
భజనాత్ స్థైర్యమాప్నోతి స్వస్వరూపమయోభవేత్ ॥ 59

తా॥ సాష్టాంగదండ ప్రణామంబుజేసి స్తోత్రంబుగావించుచు నిత్యము గురుభజన చేయవలయును. భజనవలన జ్ఞానస్థైర్యమునుబడసి స్వస్వరూపమయుడగును.

శ్లో॥ దోర్భ్యాం పద్భ్యాం చ జానుభ్యాముర సా శిరసా దృశా
మనసా వచసాచేతి ప్రణామోష్టాంగముచ్యతే । 60

తా॥ ఇచ్చట అష్టాంగప్రణామ లక్షణము చెప్పబడుచున్నది. చేతులచేతను, పాదములచేత, జానువులచేతను, వక్షోభాగ్యవక్షస్థలముచేతను. శిరసు

చేతను, నేత్రముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను నమస్కరించవలెను ఇది అష్టాంగనమస్కారము

శ్లో॥ తస్యై దిశే సతత మంజలిరేవ నిత్యం
ప్రక్షిప్యతాం ముఖరితైర్మధురైః ప్రసూనైః
జాగర్తి యత్ర భగవాన్ గురుచక్రవర్తీ
విశ్వస్థితి ప్రలయనాటక నిత్యసాక్షీ॥ 61

తా॥ ఏదిక్కున భగవంతుడును ప్రపంచ సృష్టి స్థితి సంహారములను నాటకమునకు నిత్యసాక్షియునగు గురు చక్రవర్తి జాగరూకుడై యుంటున్నాడో, అట్టి దిక్కుకొఱకు యెల్లప్పుడు అంజలిబద్ధుడై మధురములగు గురు స్తవములతోటి పుష్పములచే పూజింపవలయు

శ్లో॥ అభ్యస్తైః కిము దీర్ఘకాలవిమలైః వ్యాధిప్రదైర్దుష్కరైః
ప్రాణాయామశతైరనేక కరణైః దుఃఖాత్మకైర్దుర్జయైః
యస్మిన్నభ్యుదితే వినశ్యతి బలీవాయుస్స్వయం తత్క్షణాత్
ప్రాప్తుం తత్సహజస్వభావమనిశం సేవేత చైకం గురుమ్ ॥ 62

తా॥ దుష్కరములైనట్టియు వ్యాధిని గలుగజేయునట్టియు, చాల కాలమునకు మనోమాలిన్యమును పోగొట్టు నట్టియు, దుర్జయములైనట్టియు, దుఃఖమును గలుగజేయునట్టియు, బాగుగానభ్యసింపబడిన అనేక ప్రాణాయామములచేతను, తదితరసాధనములచేతను యేమిప్రయోజనము? వీటివలన జ్ఞానోదయము గాజాలదు ఏ జ్ఞానమైన గురుదేవుడుదయించగానే ఆక్షణమే, స్వయముగా బలమగు ప్రాణవాయువులయించుచున్నది. కనుక సహజస్వభావమగు ఆత్మానందమును బొందుటకు అద్వితీయుడగు గురువునే సేవించవలయు.

శ్లో॥ జ్ఞానం వినా ముక్తిపదం లభ్యతే గురుభక్తితః
గురోస్సమానతో నాన్యత్సాధనం గురుమార్గిణామ్॥ 63

తా॥ శాస్త్రజ్ఞానము లేనివాడుగూడ గురుభక్తివలన మోక్షపదమును పొందుచున్నాడు. గనుక గురుమార్గావలంబులకు గురువరునితో సమానము సాధనము వేరొద్దియు ప్రపంచమునలేదు.

శ్లో॥ యస్మాత్పరతరం నాస్తి నేతి నేతీతి వై శ్రుతిః
మనసా వచసా చైవ సత్యమారాధయేద్గురుమ్॥ 64

తా॥ 'నేతినేతి' అను వేదవాక్యము, 'న ఇతి' అనగా గురువుకన్న ఉత్కృష్టమగునది లేదు లేదు అనిచెప్పుచున్నది అందుచే వాక్కుచేతను మనస్సుచేతనుగూడ సత్యమగు గురువరునే యారాధించవలయును.

శ్లో॥ గురోః కృపాప్రసాదేన బ్రహ్మావిష్ణు శివాదయః ।
సామర్థ్యమభజన్సర్వే సృష్టిస్థిత్యన్త కర్మణి ॥ 65

తా॥ గురువనుగ్రహామువలననే బ్రహ్మ విష్ణు మహేశాదులు తమ యొక్క సృష్టి స్థితిలయ కర్మలయందు సామర్థ్యమును బడసిరి ఇట్లే ఇతరదేవతలు ఆయాశక్తులను పొందిరి.

శ్లో॥ దేవకిన్నరగంధర్వాః పితృయక్షాస్తుతుంబురుః
మునయోపి న జానన్తి గురుశ్శ్రూషణే విధిమ్ ॥ 66

తా॥ దేవతలు, కిన్నరులు, గంధర్వులు, పితరులు, యక్షులు, తుంబురుడు మొదలుగాగల మునులును గురుశ్శ్రూషావిధిని సరిగా నెఱుంగ జాలరు.

శ్లో॥ తార్కికాశ్ఛందసాశ్చైవ దైవజ్ఞాః కర్మఠాః ప్రియే
లౌకికాస్తే న జానన్తి గురుతత్త్వం నిరాకులమ్ ॥ 67

తా॥ తార్కికులు, శ్రోత్రియులు, జ్యోతిష్కులు, మీమాంసకులు, ఓప్రియమగు కాత్యాయనీ! వారందరు లౌకికులే గనుక అలౌకికమగు సంశయరహితమగు గురుతత్త్వము నెఱుంగజాలరు.

శ్లో॥ మహాహంకార గర్వేణ తపోవిద్యాబలేన చ ।
భ్రమంత్యేతస్మిన్సంసారే ఘటీయంత్రం యథా పునః ॥ 68

తా॥ మహాహంభావ గర్వముచేతను, తపస్సువిద్య వీటిబలముచేతను, ఈసంసారములో సకల మానవులు ఘటీయంత్రము (ఏతము) మాడ్కి మాటికి మాటికి తిరుగుచున్నారు. అనగా జనన మరణములను పొందుచున్నారని భావము.

శ్లో॥ యజ్ఞినోపి న ముక్తాస్స్యుః న ముక్తాయోగినస్తథా ।
తాపసా ఒపినోముక్తాః గురుతత్త్వాత్పరాఙ్ముఖాః ॥ 69

తా॥ యాజ్ఞికులు, యోగులు, తాపసులు, గురుతత్త్వము నెఱుంగనిచో యెన్నటికిని ముక్తులుగా జాలరు అనగా అందరికంటెను గురుభక్తుడే శ్రేష్ఠతముడు.

శ్లో॥ నముక్తాస్తు చ గంధర్వాః పితృయక్షాస్తు చారణాః
ఋషయః సిద్ధదేవాద్యాః గురుసేవాపరాఙ్ముఖాః ॥ 70

తా॥ (గురుసేవను జేయనిచో,) గంధర్వులు, పితృదేవతలు, యక్షులు, చారణులు, సిద్ధులు, దేవతలు, ఋషులు, గురుసేవయందాసక్తులు కానిచో మొదలగు వారందరు ముక్తులు కాజాలరు.

ఓమ్.

---

ఓమ్

## 20. సంగ్రహము.

మూలం॥ శ్రేయశ్చ ప్రేయశ్చమనుష్యమేత
త్తౌ సంపరీత్య వివిన క్తిధీరః
శ్రేయోహిధీరోఽభిప్రేయసోవృణీతే
ప్రేయోమన్దోయోగక్షేమాద్వృణీతే.

తా॥ విరక్తుడైన తపమొనర్చువానిని శ్రేయస్సున్ను, ప్రేయస్సున్ను పొందుచుండును. అప్పుడు నిర్మలబుద్ధిగలవాడు, ఈ శ్రేయస్సగు ముక్తిని, ప్రేయస్సగు ప్రపంచసుఖమును విమర్శించి ప్రేయస్సునుత్యజించి శ్రేయస్సును వరించును మందబుద్ధిగలవాడు ప్రపంచసుఖమందభిలాషగలవాడై శ్రేయస్సును విడనాడి ప్రేయస్సగు ప్రపంచసుఖమునే చేపట్టును. ఇది, తాపసులయొక్క పరీక్షాకాలమగును

మూలం॥ యథాఽఽదర్శే తథాఽఽత్మని యథాస్వప్నేతథా
పితృలోకే, యథాఽప్సు పరీవదదృశే తథాగన్ధర్వలోకే
ఛాయాతపయోరివబ్రహ్మలోకే.

తా॥ మనుష్యుడు, తన దేహప్రతిబింబమును అద్దమందెటుల స్పష్టముగా చూచునో, ఆప్రకారము ఆత్మస్వరూపమును యీమనుష్య జన్మమందే, బుద్ధియందు చూచుచున్నాడు స్వప్నమందు తనస్వరూప

మేలాగున అస్పష్టముగా చూడబడుచున్నదో, ఆలాగున పితృలోకమందు ఆత్మదర్శనము అస్పష్టముగానే చూడబడుచున్నది. ఉదకముల యందే ప్రకారము తనదేహము స్పష్టముగాని అవయవములుగలదై చూడబడునో, ఆలాగున గంధర్వలోకమందుగూడ తన ఆత్మస్వరూపము అస్పష్టముగా గోచరమగుచుండును. ఎండలోగల తన నీడవలెనే అస్పష్టముగా బ్రహ్మలోకమందు ఆత్మదర్శనము అస్పష్టముగానే చూడబడును. ఇది మనుష్యజన్మముయొక్క ప్రాశస్త్యమును నిరూపించుచున్నది. పితృదేవతలై జన్మించినను, దేవతలై జన్మించినను, కట్టకడకు బ్రహ్మలోకవాసులై జన్మించినను, ఆత్మసాక్షాత్కారజ్ఞానము గలుగుటకు తగిన హృదయ సంస్కారముండదు. మనుష్యజన్మము యొక్కదానియందు మాత్రమే బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమునకు తగిన బుద్ధి నిర్మాణముగలదు. కావుననే మనుష్యజన్మము సర్వోత్కృష్టమని చెప్పుటకు కారణము. అని కఠోపనిషత్తు.

శ్లో॥ సృష్ట్వాపురాణి వివిధాన్యనయాఽఽత్మశక్త్యా
వృక్షాన్ సరీసృప పశూన్ ఖగదంశమత్స్యాన్
తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోకధిషణాం ముదమాపదేవః.

తా॥ భగవంతుడు తన శక్తిచేత వృక్ష, సరీసృప, (సర్ప) పశు పక్ష్యాది వివిధదేహములను సృజించి సంతోషింపక మానవుని సృజించి ఆతడు బ్రహ్మస్వరూపుడగు తననుదర్శింపగల బుద్ధిగలవాడని తలంచి సంతసించెను. అని శ్రీమద్భాగవతము.

వి = సర్వేశ్వరుడు, పశుపక్ష్యాది తిర్యగ్జంతువులను రాక్షసాసురాదులను సృజించి దేవతలనుగూడ సృష్టించి వీరెవరును ఆత్మ సాక్షాత్కారజ్ఞానమునకు అర్హులుగాక పోవుటవల్ల తనసృష్టి నిరూపయోగమయి పోయినదని తలంచి విచారపడి మరల బుద్ధి పూర్వకముగ కట్టకడకు మఱింత తపోబలముచే ఆత్మజ్ఞానోపయోగము గలిగేలాగున మానవుల సృష్టించెనట. అందుచేత, తనసృష్టి సార్థకమయినదని తలంచి ఆనంద భరితుడాయెనట. యీ శ్రీమద్భాగవత వాక్యమును పైజెప్పిన 'కఠోపనిషత్తు' వాక్యమును మానవులు బాగుగా ఆలోచించు కొనవలయును,

కావుననే శ్రీ శంకరులు "జన్తూనాం నరజన్మ దుర్లభమ్" అని వచించుటకు కారణము, పై విషయమై మనుష్యజన్మ ఉత్కృష్టతను గురించి యెన్నియో ప్రమాణములుగలవు. వాటిని విజ్ఞులవల్ల తెలియవలయును.

---

## 21. గురు సమర్పణమ్.

శ్రీ వ్యాసాశ్రమమునకు సంబంధించిన వేలకొలది భక్తులుగలరు. వీరిలో చాలా మంది మేము గురుసేవ కొఱకే వచ్చితిమని చెప్పుదురు. యిట్టి వారలిక కొందఱు మేమన్నియు త్యజించితిమి. మీసేవయే పరమ గతియనిగూడ వచింతురు. అట్టివారితో నేను చెప్పునదేమన? అదిచాలా మంచికార్యము; సంతోషము, అయితే నాసేవ మీరెవరున్ను చేయ నక్కఱలేదు. నేను చెప్పునట్లు మీరు చేయుటెదిగలదో; అదియే నాసేవ యగును. నేను మిమ్ములను నాసేవకొఱకు నియమించఁదలంచలేదు. నాయాశయమును నెరవేర్చులాగున చేసినచాలును. అదేమన? మీజీవిత మంతయు ఉత్తమమగు సంస్కృతము చదువుటలోను, ఆత్మశుద్ధికొఱకు తపస్సుచేయుటలోను వినియోగపఁచవలెను. అట్లుగాక మీమోక్షము కొఱకు ధ్యానముచేయ వలయునన్న తలంపును గూడ మఱువవలయును. అది కావలసిన మఱియొక జన్మమున జేయవచ్చునని కట్టిపెట్ట వలెను. అట్లైన మీరు ముక్తులని భావము మీకు అచిరకాలములోనే గల్గును. యీవిద్యయున్ను, తపస్సున్ను, దేనికొఱకనగా? పతితమైన బ్రహ్మ విద్యను పునరుద్ధరించుటకొఱకే! యీలాగున మొట్టమొదట కొందరంగీ కరించినను కొద్దిరోజులు పోవునప్పుడు సంస్కృతవిద్యలోగల కాఠిన్యమును సహింపజాలకయు నియమబద్ధజీవితము గడుపజాలకయు యీలాగునఁ జెప్పప్రారంభింతురు. అదేమన? మేము యీ లాగున విద్యాతపస్సులలో కాలముగడపిన మేమెట్లు మోక్షము నొందగల్గుదుము. కావునయచ్చోట నైన యేకాంతముగనుండి ధ్యానము చేయవలెనని కొందఱున్ను మఱి కొందరు నాయాత్మప్రాప్తికి యేదైన జూచుకొనకపోయిన మాకుసద్గతి యెట్లు గల్గుననియు చెప్పుకొని వెళ్ళుటయు తటస్థించు చున్నది, యిట్టి

భీ-ువులెవ్వరున్ను నాకక్కఱలేదు. సరియైన ఒకపురుషుడున్ను ఒకనారీమణియున్ను యుండినఁజాలును. లోకక్షేమమునకు ఒకసూర్యుడు ఒక చంద్రుడు యుండినఁజాలునని మీరు చూచుటలేదా? అట్లుండువారు యెట్లుండ వలయునో, యీజన్మమంతయు శ్రీ గురుదేవుని యాజ్ఞ ప్రకారము సంస్కృతవిద్య చదువుటలోను, తపస్సుచేయుటలోను, పిని యోగపరచెదము. అనివేదమంత్రప్రకారము సంకల్పముచేయవలయును. ఒకవేళ తాను పూనిన కార్యమును సాధించవలెను. లేక మరణించవలెనని వజ్రసదృశమగు కఠినమైన దృఢతరమగు హృదయము గల్గియుండ వలయును. అట్టివారు తప్ప మఱియెవ్వరున్ను పనికిరారు సృష్ట్యారంభమునుండి నేటివఱకు యెన్నియో జన్మములెత్తెనుగదా? యీయొక్క జన్మము గురుదేవున కర్పించకూడదా? గురుదేవున కర్పించిన చిన్నదగు ఉప్పు కల్లు సముద్రములో పడిపోయిన మహాసముద్రమగునట్లున్ను కర్పూరము అగ్నిలోప్రవేశించిన అగ్నిమయమగు నట్లున్ను తమనామరూపులులయములై పుప్పు మహాసముద్రమగు నట్లున్ను కర్పూరమగ్నిమయమగు నట్లున్ను శ్రీ గురు స్వరూపు లగుదురు గదా? అంత విశ్వాసమున్ను, మనోధైర్యమున్ను వీరికిలేదే; యీలాగున గురుదేవునికి తమ జీవితము సమర్పింపదలంచువారు ప్రప్రథమమున సోమఱిదేవతకు మంత్ర పూర్వకముగా తర్పణమిడవలయును. స్వార్థము కొంచమైనను తమలో గలుగ నీయక చూడవలెను. దృశ్యవాసనగాని, విషయవాసనగాని, గురుదేవునికి సమర్పించిన తమపవిత్రహృదయమును స్పర్శించకుండయుండేలాగున కృతప్రతిజ్ఞ గలవారుగ నుండవలయును. యిట్టివారివల్లనే యీలోకముద్ధరించబడవలయును. యీ భారతదేశములోగల 40 కోట్ల స్త్రీ పురుషులు సంసార సాగరమున పడియుండి, అనుభవించెడు సంకటములఁ జూచినఁ జాలదా? వీరుయేగతిని పొందుచున్నారు. ఆలాగున మీరున్ను యేల పవిత్రమగు మానవజన్మమును పాడుచేయవలెను? మరణము వారికిన్ని మనకున్ను సమానమే, అట్లుండగమనము ముక్తులమై దివ్యపదవిని పొంద కూడదా? తండ్రిసంపాదించిన ధనమంతయు కుమారులకుఁజేరునట్లు గురుదేవుడు సంపాదించిన జ్ఞానవిజ్ఞానధనములన్నియు గురుదేవుని కొఱకర్పించిన జీవితముగలవారలకు తప్పక చెందును. యిదిసత్యము. కావుననేశ్రుతి

యీలాగున వచించుటకుఁ గారణము. "విద్యాతపోభ్యాంపూతాత్మా" విద్యచేతను, తపస్సుచేతను ఆత్మపునీతమగును. "తపోవిద్యాచ విప్రస్య నిశ్శ్రేయసకరం పరం, తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృత మశ్నుతే"

తా॥ మానవునకు, తపస్సున్ను, విద్యయున్ను మిక్కిలి శ్రేయస్సును కలుగజేయును. తపస్సుచేత పాపములన్నియు భస్మములగును. బ్రహ్మవిద్యచే మోక్షమున్ను గల్గును.

గురు గీతయందు గురుదేవునకు ఆత్మార్పణముజేయు శిష్యుని లక్షణమీలాగున పరమశివుండు పార్వతీదేవి కుపదేశించెను.

"శ్లో॥ శరీరమింద్రియం ప్రాణమర్థం స్వజనబాన్ధవాన్, ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యో నివేదయేత్" శరీరమును, యింద్రియమును, ప్రాణమును, ధనమును, తనవారును, బంధువులును, అని గాగలవన్నియు, తదారాది యావత్తున్ను, సద్గురువు కొఱకు వినియోగ పరచవలయును అనగా యీ పైజెప్పినవన్నియు గురుకార్య నిర్వాహణమునకు అడ్డుగల్గిన తొలగించవలయును. జనకుడు యాజ్ఞవల్క్యమునికిన్ని, శివాజీ తన ఆత్మగురుడగు సమర్థ రామదాసుగార్కిన్ని యీ లాగుననే జేసిరి.

ఓమ్.

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు.

ఓం తత్ సత్.

సంపూర్ణము.

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు. Q-H 22/29-12 47 కా 2000